# పెండ్లి పరీక్ష







...యూర్ పాక్
దున్నపోతులా తినటం
ఇంపాజిబుల్ తెలుసా ...? "
– 33 వ పుట.

ప్రత్యూష ప్రచురణలు * హైదరాబాదు - 20

1

# అసలు
# లావెక్కడంలోనే ఉంది
# తమాషా అంతా!

మొన్ననోసారి ఓ తమాషా జరిగింది. ఓ రిక్షాలో లావుపాటి పెద్దమనిషి కూర్చుని పోతున్నాడు. రిక్షావాలా పక్కకు పోయాడు ఏదో పనిమీద రిక్షా ఆపి. రిక్షా 'ఉతారు'లోకి జారుకుంటూపోవడం మొదలు పెట్టింది. రిక్షా వెనక్కి వెనక్కి పోతూంటే– ఆ పెద్దమనిషి – ఏమీ చెయ్యలేక దిగాలుపడి కూర్చునున్నాడు. అటూ ఇటూ పోయే జనం అంతా యిది చూసి– పకపకా నవ్వడం మొదలు పెట్టారు. ఇంతలో రిక్షావాలా తిరిగి వచ్చాడు. వచ్చినవాడు – రిక్షా ఆపచ్చా? ఉహూ! వెనకాల చేతులుపెట్టుకు నవ్వడం ప్రారంభించాడు. ఆ రిక్షా గిర్రున తిరిగి పేవుమెంటుకి లగిలి తక్కున ఆగింది. ఆ నవ్విన ప్రజానీకంలో నేనూ ఉన్నా ననుకోండి! కాని ఏ ప్రమాదం జరగలేదు కాబట్టి సరి పోయింది. వెనకాతల కారూ గీరూ వస్తే ఏమయ్యేది?

అసలు ఈ సంగతంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే – లావుపాటి వాళ్ళను చూస్తే ఎందుకో అందరికీ వెక్కిరింపూ. వేళా

కోశమూను. ఈ రిక్షా సంగతి అలా ఉంచండి. మరెక్కడయినా సరే.
అదేమిటో లావుపాటివాళ్ళను చూడగానే నవ్వడం ప్రారంభిస్తారు జ
మనిషి లావు ఎంత ఎక్కువ అయితే వీళ్ళ నవ్వు అంత ఎక్కు
అవుతుంది. అప్పుడప్పుడు నే ననుకుంటాను- ఈ నవ్వుతూన్నవాళ్ళను
పిలిచి కేక లెయ్యాలని : "ఏమిటయ్యా ! మీరంతా ఎందుకయ్యా నవ్వు
తున్నారు ? ఆయన లావుకీ, మీ నవ్వుకీ సంబంధం ఏమిటీ ? ఆయన
లావుగా ఉండడం ఆయన తప్పు కాదుకదా ? ఒకవేళ - అది ఆయనలో
లోపమే అనుకోండి. అయితే- ఆయన్ని చూసి జాలిపడాలి గాని, నవ్వు
తారా ? ఊ ! చాల్లెండి !" అని.

వెంటనే మీ రడుగుతారు : "మీ కెందుకండీ ఈ ప్రేమాభిమా
నాలూ- లావుపాటి వాళ్ళంటే ?" అని. మీరల్లా అడిగితే నేను చెప్పలే
ననుకోండి. సహజంగా నే నంత లావుపాటి మనిషిని కాను. ఏ దయినా
కొద్దో గొప్పో లా వున్నప్పటికీ - అది పొడుక్కు తగ్గ లావే అను
కుంటాను. మా ఆవిడ అప్పుడప్పుడు ఏదో అంటుంటుంది కాని - ఆ
మా ఆవిడ అనడాని కేమిలెండి. మనిషి - మహా వేళాకోళాలు చేస్తూం
టుంది. నిజంగా నేను కనక లావే అయితే మొహంమీద ఎప్పుడో
చెప్పేసుండును.

పోనీ - నేను నిజంగా లావుపాటి మనిషినే అనుకోండి. ఇంకా !
రోజు రోజుకీ లా వెక్కుతున్నా ననుకోండి : అహఁ ! అనుకోండి -
నిజంగా అల్లా జరుగుతూందని కాదు. ఒకవేళ నిజంగా అల్లా జరిగినా ;
అందులో విచారపడవలసిందీ, మధనపడవలసిందీ ఏముందీ ? ఏమీ
లేదు - సరికదా : మీ రడుగుతున్నారు కాబట్టీ చెప్తున్నాను—— నాకు
లావుపాటి వాళ్ళను చూస్తే మహా గౌరవం ! లా వెక్కుతూన్న వాళ్ళను
చూస్తే మరీ గౌరవం! ఒకరు: జీవితంలోని పరమలక్ష్యాన్ని అప్రయత్నం

గానే సాధించారు; రెండోవారు: ఆ లక్ష్యసాధనకోసం కష్టాలుపడుతూ ముందుకు సాగుతున్నారు. అసలు నన్నడిగితే లావెక్కడంలోనే ఉంది తమాషా అంతా అంటాను.

అసలు ప్రపంచలో కీర్తి గడించిన వాళ్ళంతా లావుపాటి వాళ్ళే. ఈ మాట యిప్పుడే కాదు; పూర్వకాలంలో కూడా నిజమే. డా. జాన్సన్ సంగతి చూడండి. ఇంగ్లీషులో ఒక పెద్ద డిక్షనరీ రాశాడు; చాలా గొప్పవాడని ప్రసిద్ధి కెక్కాడు. అతడు రాసిన రచనల విషయంలో ఎంత పేరు తెచ్చుకున్నాడో – తిండి తినడం విషయంలో కూడా అంత పేరూ తెచ్చుకున్నాడు. చెపుతూంటారు : అతగాడు రాసింది అట్టే మంది చదవరట కాని అతన్ని మాత్రం మరిచిపోలేరుట. కేంటర్బరీ కథలు రాసి ప్రసిద్ధి కెక్కిన ఛాసర్‌ను తీసుకోండి. లేదా; షేక్స్పియర్ కాలపు గొప్ప నాటకరచయిత బెన్ జాన్సన్‌ను తీసుకోండి. వారందరూ కూడా వారి గ్రంథాల నిమిత్తం ఎంత ప్రసిద్ధికెక్కారో వారి 'ఉదర నిమిత్తం' కూడా అంతే ప్రసిద్ధి కెక్కారు.

అదంతా దేనికి ? మన పోతనామాత్యుడి సంగతి చెప్పండి. తెలుగుజాతికి చెందినవా దెవడయినా ఆంధ్ర మహాభాగవత కర్త పోతన పేరు వినకుండా ఉంటాడా ? దైవభక్తులు కానీండి ; సాహితీవేత్తలు కానీండి – ఇంటింటా పోతన పేరు వినబడవలసిందే కదా ! అట్టి మహాకవి పోతన లావుగా ఉండేవాడా? సన్నగా ఉండేవాడా ? నాగయ్యగారి పోతన చూసిన వాళ్ళకి ఈ విషయంలో ఏ మాత్రం సందేహం ఉండ కూడదు.

పూర్వకాలపు వాళ్ళసంగతి దేనికి? సర్ విన్‌స్టన్ చర్చిల్ సంగతి చెప్పండి; రఫీ అహమ్మదు కిద్వాయ్ సంగతి చెప్పండి ; ఆంధ్రకేసరి ప్రకాశం సంగతి చెప్పండి ; శ్రీ శ్రీప్రకాశా సంగతి చెప్పండి. జర్మనీ

మీద యుద్ధంచేసి చర్చిల్ పేరు తెచ్చుకొంటే ; కరువు కాటకాలపైన దాడి చేసి కిద్వాయ్ పేరు గడించాడు. జాతీయోద్యమ యోధులుగా ప్రసిద్ధికెక్కి తరువాతి రోజుల్లో ముఖ్యమంత్రిగా ప్రకాశం ; గవర్నరుగా శ్రీప్రకాశా వెలుగు తెచ్చుకొన్నారు. వీళ్ళందరూ లావుగా లేరూ ?

అయితే ఒక విషయం. అందరు గొప్పవాళ్ళూ లావుగా ఉంటారని నే ననటం లేదు. ఉదాహరణకి : బెర్నార్డ్‌షాను తీసుకోండి. ఆయన సన్నగా తాడులా ఉండేవాడు. అయితే నేం ? చాలా పేరు సంపాదించుకున్నాడు. అందుకు సందేహం లేదు, అయినప్పటికీ యిది ఆలోచించండి. షా సన్నగా ఉంటేనే అంత గొప్ప వాడయ్యేడే; లావుగా ఉంటే యింకా ఎంత గొప్ప వాడయ్యేవాడో ! ఊహించలేం. చాలా గొప్ప వాడయిపోయేవాడు. బహుశః షేక్స్పియర్‌ని మించిపోయేవాడు.

షేక్స్పియర్ అంటే జ్ఞాపకం వచ్చింది. షేక్స్పియర్ లావుగా ఉండే వాడంటారా ? సన్నగా ఉండే వాడంటారా ? నా ఉద్దేశ్యం అతను చాలా లావుగా ఉండేవాడని. ఎల్లాగ — అని నన్నడకండి. నేను చెప్పలేను. అతని బొమ్మను చూస్తే అలా అనిపిస్తుంది. పైగా – ఫాల్స్టాఫ్ అంతటి వాణ్ణి సృష్టించిన కవిశేఖరుడు లావుగా ఉండడంటే ఎలాగ నమ్మడం ? బెర్నార్డ్‌షా చివరిరోజుల్లో ఎప్పుడూ చిరాకుగా ఉండేవాడుట. గొప్పవాడుకదా అని ఇంటర్వ్యూకోసం పోతే కఱ్ఱ పుచ్చుకొని వీథిగుమ్మం వరకూ తరిమి కొట్టేవాడుట. ఇంత చిరాకు లావుపాటి వాళ్ళ కుంటుందంటే మీరు నమ్మగలరా ? నేను నమ్మలేను. మీ రెప్పుడయినా చూశారో లేదో – లావుపాటివాళ్ళ కున్న హాస్యం సన్నపాటి వాళ్ళ దగ్గర ఉండనే ఉండదు. వాళ్ళదగ్గర – అంటే నా ఉద్దేశ్యం లావుపాటివాళ్ళ దగ్గర అని– ఎప్పుడూ చిరునవ్వులు తొణికిసలాడుతుంటాయి. వా ళ్ళెప్పుడూ తమను తామే వేళాకోళం చేసుకుంటూ తిరుగుతూంటారు.

కుర్చీలో కూర్చుంటూ "ఈ కుర్చీ ఉంటుందా. ఊడుతుందా" అనే వాళ్ళను నేను చూశాను. హోటల్లో భోజనానికి వెళ్ళితే "ఈవాళ మీ హోటల్ దివాళాయే" అంటూ భోజనానికి కూర్చున్న వాళ్ళను నే నెరుగుదును. మా మిత్రు డొకాయన ఉన్నాడు : "ఈ వేళ మీ కారులో నాకు సీటుంటుందా ?" అని అడిగితే; "ఈ వేళ మా ఆవిడ కూడా వస్తుందండీ ! ఇద్దరూ కూర్చున్నప్పుడు కారులో యింక సీ టుండదూ!" అంటూంటాడు. ఇప్పటికీ మా స్నేహితు డొకాయన కారులో కూర్చుంటే మధ్యన కూర్చుంటా నని పేచీ పెడతాడు. "ఏమయ్యా ?" అంటే "ఎందుకేనా మంచిదీ !" అంటాడు.

ఈ శక్తి — తనని చూచి తనే నవ్వుకోగల శక్తి — సన్నపాటి వాళ్ళకి చస్తే రాదు — అంటే అదే — మాటవరసకి చెపుతున్నాననుకోండి. బెర్నార్డ్‌షా సంగతి చూశారుగా ? జనాభా అంతా అలాగే ఉంటారు. వాళ్ళకున్న కృత్రిమ తెలివితేటలు లావుపాటివాళ్ళ కసలే రావు. లావుపాటివాళ్ళు ఎప్పుడూ నవ్వుతూ పేలుతూ ఉంటారేమో— వాళ్ళకి కృత్రిమాలూ, కుట్రలూ అర్థంకావు. సన్నపాటివాళ్ళ సంగతి చెప్పక్కర్లేదు. షేక్స్పియర్ ఏమన్నాడో తెలుసా ? "లీన్ అండ్ హంగ్రీ కేసియస్" అన్నాడు. మరి కేసియస్‌ను చూడండి ! ఫాల్‌స్టాఫ్‌ను చూడండి.

మనలో ఒక సామెత ఉంది. "పొట్టివాళ్ళకి పుట్టెడు బుద్ధులు" అని. పొట్టివాళ్ళని సాధారణంగా నమ్మటానికి వీల్లేదు. వాళ్ళు ఎప్పుడు ఎక్కడ ఏం చేస్తూంటారో భగవంతుడికి తెలియాలి. అవునా ? అతగాడికయినా తెలుసో తెలియదో సందేహమే. పాపం ఈ లావుపాటి వాళ్ళున్నారు చూశారూ ? పొట్టివాళ్ళ చేతులలో యిట్టే మోసపోతుంటారు. అయితే పొడుగులో పొట్టివాళ్ళు "పొట్టి" అయితే లావులో సన్నవాళ్ళు

"పొట్టి" ! అంతే గదా ? మరి పొడుగులో పొట్టివాళ్ళని నమ్మలేకపోతే లావులో పొట్టివాళ్ళని ఎలా నమ్మగలం ? షేక్స్పియర్ ఊరికే అనుంటాడా ?

మరి సన్నగా ఉన్నవాళ్ళందరూ లావుపాటి వాళ్ళను ఎందుకు హేళన చేస్తారు ? చెప్పమంటారా ? కారణం ఏమిటంటే వాళ్ళకూ్కడా మనసులో లావెక్కాలనే ఉంటుంది. లావెక్కితే బాగుంటుందని వాళ్ళు అనుకుంటారు. కాని లావెక్కడం చేతకాక మనసులోని అక్కసు నంతనీ ఈ విధంగా బయట పెడుతూంటారు. భగవంతుడు హఠాత్తుగా ప్రత్యక్షమై "నీకు లావు కావాలా ? బలం కావాలా ? ఈ రెంటిలో ఏదో ఒకటే కోరుకో !" అన్నా డనుకోండి. వెంటనే వాళ్ళందరూ "లావే కావాలి !" అని ఏకగ్రీవంగా కోరుకుంటా రనడంలో సందేహం లేదు.

అదే పూర్వకాలపు వాళ్ళకీ ఇప్పటికాలపు వాళ్ళకి తేడా. అప్పటి వాళ్ళు ఇప్పటి వాళ్ళలాగ మనసులో ఒకటి పెట్టుకొని ఇంకొకటి మాట్లాడడం ఎరుగరు. వాళ్ళు 'మనసా : వాచా : కర్మణ్యా' ఎల్లప్పుడు సత్యాన్నే కలిగుండే వారట. వాళ్ళకి మనస్సులో లావెక్కాలని బుద్ధిపుట్టింది అనుకోండి. ఆ విషయం పయికి స్పష్టంగా చెప్పేవారు. ఇప్పుడో ? అల్లా కాదు. ఆ విషయం మనసులో పెట్టుకొని, పైకి అడగడానికి సిగ్గుపడి, లావుపాటి వాళ్ళను వేళాకోళం చేస్తూ తిరుగుతారు ; కాలం గడుపుతారు. చూస్తూంటే అసహ్యం వేస్తుంది. మరి పూర్వకాలపువాళ్ళ సంగతి చూడండి ! గజేంద్రుడేం చేశాడు ? లావెక్కాలని బుద్ధి పుట్టింది. వెంటనే దేముణ్ణి ప్రార్థించాడు : "లా వొక్కింతయు లేదు ; ధైర్యమున్ విలోలంబయ్యె... ....". అంటే ' లావు ' — "ఒక్కింతయు" — ఒక్క యూనిట్ కూడా లేదు —చూడగా చూడగా, "ధైర్యమున్ విలోలంబయ్యె" —నెర్వస్

పీక్నెస్ వచ్చేటట్లుగా ఉంది.— రక్షించవయ్యా భగవంతుడా రక్షించూ— అంటూ మొరపెట్టుకున్నాడు. సర్వాంతర్యామి భగవంతుడు. అతనికి తెలియనివంటూ ఏమీ లేవు ; భక్తుల కోర్కెలను అతడెన్నడూ తిరస్కరించలేదు. గజేంద్రుడికి ఏదో ఒక 'టానిక్' యిచ్చుండాలి. ఏమిచ్చుంటాడో తెలియదు. ఈ కాలపు భగవంతుడైతే, ఏ 'మస్కా మసాలా' దోశో తీసుకోమని చెప్పుండేవాడు. పోతన రచన లన్నిటిలో సమగ్ర పరిశోధన చేస్తే విషయాలు గ్రాహ్యం అవుతాయి. ఎవరేనా పుణ్యం కట్టుకుంటే బావుణ్ణు.

లావుపాటివాళ్ళు సన్నపాటివాళ్ళకంటే మానసికంగా ఉత్తమ స్థాయిలో ఉంటారని నిరూపించ వచ్చును. ఇంకా అనేక ఉదాహరణలు చూపించవచ్చు. కాని కాలం మనకు వ్యతిరేకంగా నడుస్తుంటుంది. అయితే లావుపాటివాళ్ళు శారీరకంగా కూడా ఉత్తమస్థాయిలో ఉంటారని నిరూపించడానికి ప్రయత్నం చేస్తాను.

మా ఊళ్ళో దాదాపు అందరిళ్ళల్లోను దొంగతనాలు జరిగాయి. కాని సుబ్బయ్య తాతగారింటికి చస్తే పోరు దొంగలు. ఒకసారి పొరపాటున దొంగతనం చెయ్యడానికి వెళ్ళారుట. గోడకి కన్నంతవ్వితే సరిగ్గా ఆయన మంచం క్రిందికి వచ్చిందిట. కన్నం తవ్వుతూన్నంతసేపూ పాముచెవులు పెట్టుకుని వింటూన్న ఆ పెద్దమనిషి — అక్షరాలా 'పెద్ద' మనిషే ఆయన— దొంగాడు కన్నంలోంచి లోపలికి వచ్చే వరకూ నిశ్శబ్దంగా పడుకున్నాడుట. దొంగాడ్ని మంచం బయటికి రానిచ్చి— దొర్లి వాడిమీద పడ్డాడట. చప్పుడువిని కన్నంలో దొంగలు కన్నంలోంచే చీకటిలోకి కరిగిపోయారుట. ఆ దొంగాడికి కాళ్ళూ చేతులూ 'ఫ్రేక్చర్' కావడంవల్ల ఆరునెల్లు — ఉద్యోగరీత్యా — పగలూ రాత్రి కూడా బయటికి పోవడానికి వీల్లేకపోయిందిట. అప్పటి నుంచీ దొంగలు

ఎందుకయినా మంచిదని— ఆ చుట్టుప్రక్కల యిళ్ళు కూడా దొంగతనం చెయ్యడం మానేశారుట.

లావుగా వున్నవాళ్ళను పరిహాసం చేసేవాళ్ళను చూస్తే నాకు పరమ అసహ్యం. ఎందుకంటే : నిర్మాణాత్మక పథంలో ఆలోచించి దేశాభివృద్ధికోసం ముందుకు సాగడానికి బదులు ; లేనిపోని అసూయలు పెట్టుకొని అభివృద్ధినిరోధకులుగా తయారవుతున్నారు. మహాకవి గురజాడ ఏమన్నాడు ? "కండకలవాడేను మనిషోయ్" అన్నాడు. "దేశాభిమానం నాకు కద్దని ఒట్టి గొప్పలు చెప్పుకోకోయ్" అన్నాడు. అవునండీ ! ఊరికే గొప్పలు చెప్పుకు లాభం ఏమిటి ? నిజంగా దేశాభిమానమే ఉంటే లావెక్కడానికి శతవిధాల యత్నంచేసి చూపెట్టాలి. ప్రతివాడూ లావెక్కవలసిన ఆవశ్యకతను పెద్దలందరూ గుర్తించారు ; సామాన్య ప్రజకు గుర్తుచేశారు. లావెక్కడంలో ఉన్న ఆనందాన్ని గుర్తించవలసిందిగా ఆంధ్రప్రజానీకాన్ని నేను ప్రార్థిస్తున్నాను. నేను పుట్టినప్పుడు 30 పౌ. బరువుండే వాణ్ణిట. యిప్పుడు సుమారు 230 పౌ. బరువున్నాను. రక్తమాంసాలలో క్షణ క్షణానికి అభివృద్ధి కలుగుతూంటే కలిగే ఆనందం, మహాత్మాగాంధీ ప్రభృతులకి మానసికాభివృద్ధి వలన కలిగిన ఆనందానికి ఏ మాత్రం తీసిపోదని నా ధృఢ విశ్వాసం. నా యీ విజ్ఞప్తి ఫలితంగా ఆంధ్రప్రజానీకంలో అతికాయుల, మహాకాయుల సంఖ్య విపరీతంగా పెరుగుతుందనీ : తత్ఫలితంగా — నేను — ధన్యుడ నవుతానని ఆశిస్తున్నాను— జై హింద్ — జై భారత్.

[ 1955 ]

౧

# 'తుమ్మెదా ఒకసారి . . .'

2

"తుమ్మెదా ఒకసారి మోమెత్తి చూడమని చెప్పవే రాచిలుకతోడ" అంటూ పాడడం ప్రారంభించాడో గాయక శిఖామణి. తుమ్మడాన్ని గురించి ఎందుకు పాడవలసి వచ్చిందో నా కర్థం కాదు. బహుశః ఆయనకు తను బాగా తుమ్మగలనని గర్వం అయివుండచ్చు. మనుష్యులకు అనేక రకాల గర్వాలు ఉంటాయిట. పొడుగ్గా ఉన్నానని ఒకరికి గర్వం అయితే, పొట్టిగా ఉన్నానని మరొకరికి గర్వం. తను డబ్బు విషయంలో చాలా పొదుపుగా ఉంటానని ఒకరికి గర్వం అయితే, తను డబ్బు విచ్చలవిడిగా ఖర్చు పెట్టగలనని వేరొకరికి గర్వం. తనకు ఆత్మగౌరవం, గర్వం, ఇత్యాది ఎక్కువగ ఉన్నాయని ఒకరికి గర్వం అయితే అసలు తనకు గర్వమన్నదే లేదని మరొకరికి గర్వం.

పైన చెప్పానుగా— ఆయనకు తను బహుశః బాగా తుమ్మగలనని గర్వం ఏమో నని ? అసలు నన్నడిగితే, బాగా తుమ్మగలనని గర్వం కలిగి ఉండడంలో అర్థం లేదు. కాని - మనుష్యు లనేక రకాలుగా

ఉంటారు. వాళ్ళ కనేక రకాల గర్వాలు ఉంటాయి. మన మేమీ అన డానికి వీల్లేదు.

నాకు పటుక్కున నాకు తుమ్మడ మంటే అదో రకమైన భయం. తుమ్మేటప్పుడు మొహం అష్టవంకరలుగా తయారవుతుంది. స్వతహాగా నా మొహం కొంచెం తీరుగా ఉంటుందేమో — ఈ సంగతి మా ఆవిడ కూడా కాదనటానికి వీల్లేదు! — తుమ్మితే మరీ అసహ్యంగా తయా రవుతుంది. ఆవిడగారు అప్పుడప్పుడు నన్ను ఏడిపిద్దామని ప్రయత్నం చేస్తూ వుంటుంది. ఈ మధ్యనే ఒకసారి చల్లగా నా పక్కన చేరి అంది: "ఏమండీ? మీరు నిన్న తుమ్ముతూంటే చూశాను. ఎంతో బాగున్నారు. సరిగ్గా దిలీప్‌కుమారులా ఉన్నారు" అని. నేనా మోసపోయేవాణ్ణి? నాకు తెలియదూ దిలీప్‌కుమారు తుమ్ముతూండగా ఆవిడ ఎప్పుడూ చూడ లేదని?...

సరి సరి! ఒక విషయంలోంచి యింకో విషయంలోకి పోయి నట్టున్నాను. ఆ పాట పాడిన పెద్దమనిషిని గురించి కాదూ చెప్తున్నాను? ఆయనకు బాగా తుమ్మగలనని గర్వం ఉందనుకోండి. నిజంగా ఆయనకు గర్వమే ఉంటే, అవకాశ మున్నప్పుడల్లా తుమ్మడానికి ప్రయత్నించాలి! తుమ్ములు వస్తే - అప్రయత్నంగానే తుమ్మాలి; తుమ్ములు రాకపోతే అథవా ముక్కుపొడుం పీల్చయినా తుమ్మాలి. ఉహూఁ! ఆయన అల్లా చేయడట. తుమ్మితే "ఒకసారి" మాత్రమే తుమ్ముతాడట. "తుమ్మెదా ఒకసారి" మాత్రమే అంటూ మనల్ని జడిపిస్తున్నాడు - ఆయనతుమ్ము ఏదో పెద్ద విలువగల దయినట్టు; ఒక్కొక్కసారి ఒక్కొక్కదానికంటే మనకు ఎక్కువ ప్రసాదిస్తే మనం ఏదో "వేస్టు" చేసి పారేస్తామేమో అన్నట్టు.

ఇంతే కాదు. మోమెత్తి చూడమని అంటున్నాడు. "ఎవరి మోము" అన్నది ప్రశ్న. తుమ్మేటప్పుడు కర్త - అంటే తుమ్మే పెద్ద

మనిషి అన్నమాట - రైల్వేసిగ్నల్‌లాగ తలకాయదించి తుమ్మడుకదా ? తనకి యిష్టమున్నా లేకపోయినా తుమ్మేటప్పుడు తలకాయెత్తి తుమ్మవలసిందే. ఇంకా "మోమెత్తి" అనడంలో అర్ధమేమిటి ? బహుశా కర్త యింకో విధంగా ఉద్దేశించి ఉండవచ్చు. "నేను తుమ్ముతాను, నువ్వు నీ మోమెత్తి చూడు" అని అతని ఉద్దేశ్యం అయి ఉండవచ్చు. ఎందుకంటే —— "నేను తుమ్ముతాను; మోమెత్తి అంటే నా మోమెత్తి నువ్వు చూడు'' అనే కనక కర్త ఉద్దేశ్యం అయితే దానికి చాలా అభ్యంతరాలుంటాయి. ఉదాహరణకి ఒకటి రెండు చెపుతాను. తుమ్మడానికి ఎత్తిన మోమును యింకా యెత్తి చూడడం అసంభవం. ఇంకోవిషయం ఏమిటంటే ఒక ప్రక్కన తుమ్ము తుఫానులా ముంచుకొస్తూంటే - "సరిగమ పదనిస'' అని పాడుతూ తన మోమెత్తిచూడమని ఎదటివాళ్ళను అడిగేవరకు అవకాశం ఎక్కడుంది ?

పోనీ కర్త ఉద్దేశ్యం: "తుమ్మెదా ఒకసారి మోమెత్తి —— చూడమని చెప్పవే రా చిలుకతోడ" అనేమో అనుకుంటే, దానికి కూడా ఒకటి రెండు అభ్యంతరాలున్నాయి. ఎవరికి తుమ్ము వచ్చినా మోమెత్తే తుమ్ముతారు. నా సంగతి నేను చెప్పానుగా ! అందరూ అంతే. మా యింటి పక్కని వెంకయ్యగారి తమ్ముడు తుమ్మాడంటే మొహం 270° కోణంలో ఎత్తి మరీ తుమ్ముతాడు. మొహం ఎంత ఎత్తుతారు అన్నది ప్రశ్నే కాని; ఎల్లరూ మొహం ఎత్తి మరీ తుమ్ముతారన్నది పరమ సత్యం. మరి ఈ కర్త ప్రత్యేకంగా తనే "మోమెత్తి" తుమ్మేటట్లు చెప్పుకోటం దేనికి ?

ఈ పాటకు అసలు కారణమేమిటో నాకు తెలుసు. ఏమిటో ఒక నిమిషం ఆగి చెబుతా నుండండి.

అయితే యింతవరకు కర్తను గురించి – అంటే తుమ్మబోతున్న ఆ పెద్దమనిషిని గురించి – ప్రస్తావించాం. ఇక కర్మను గురించి కూడా ఆలోచిద్దాం. "తుమ్మెదా .... చెప్పవే''. ఎవరితోటి ? రా చిలుకతోటి ! మిమ్మల్ని అడుగుతున్నా నని ఏ మనుకోకండి కాని, మీ రెప్పుడయినా చిలకతో తుమ్మడాన్ని గురించి మాట్లాడే వాళ్ళను చూశారా ? నేను చూడలేదు. కర్త కూడా చిలక నుద్దేశించి ఈ పలుకులు పలికేడని నేను అనుకోను. ఇందులో అంతరార్థ మేదో ఉంది.

మా క్లాసులో ఒక అమ్మాయి ఉండేది. ఆమెకు తలిదండ్రులు ఏమి పేరు పెట్టారో తెలియదు. "భారత భాగ్యలక్ష్మి సత్యభీమేశ్వరీ వెంకటరత్నం" అని పే రెట్టుండవచ్చు; లేదా అంతకంటే పెద్ద పేరే పెట్టుండవచ్చు. కాని మేమందరం ఆమెను ముద్దు ముద్దుగా 'చిలకమ్మ' అని పిలిచే వాళ్ళం. 'పిలిచే వాళ్ళం' అంటే – అదే – అర్థమయిందిగా ? అస లీ పేరు ఎవడు పుణ్యం కట్టుకున్నాడో తెలియదు. ముప్ఫయిమూడు కోట్ల దేవతలు 'క్యూ'లో నిల్చునుండగా ఆమెకు ఈ పేరెందుకు పెట్ట వలసి వచ్చిందో తెలియదు. బహుశః ఆమెముక్కు చిలకముక్కులా ఉంటుందనేమో ? లేకపోతే ఆమెకు జామపళ్ళు యిష్టమనేమో ? ఏది ఏమైనప్పటికీ, ఆమె "చిలకమ్మ" అయి కూర్చుంది.

ఇదంతా ఎందుకు చెబుతున్నానో తెలుసా ? " చిలకమ్మ " అనే పేరు మీరు విన్నారు కాని '' చిలకయ్య '' అనే పేరు మీరు ఎప్పుడయినా విన్నారా ? లేదు. అంటే, 'ఎ' అనే వ్యక్తి ''చిలకా'' అని, 'బి' అనే వ్యక్తిని పిలుస్తున్నా డనుకోండి, (లేదా పిలు స్తోందనుకోండి). దాన్నిబట్టి మనకు ఏం తెలుస్తోందంటే – 'ఎ', మగ వాడయినా ఆడదయినా కావచ్చు కాని 'బి' మాత్రం తప్పక ఆడదే ! (మీకు రహస్యంగా చెబుతున్నాను. మళ్ళీ కొంపతీసి మా ఆవిడ దగ్గర అనేరు ! అప్పుడప్పుడు మా ఆవిడ దుర్వాసుడి పాత్ర ధరిస్తూ ఉంటుంది. మరీ

చేతులు దాటిపోతుంటే 'చిలకా' అని సున్నితంగా వ్యవహరిస్తాను. అంతే ! ఎక్కడి కోపం అక్కడ పటాపంచలయిపోతుంది.)

అయితే మనకు స్పష్టమైన విషయం ఏమిటంటే, "చిలక" అంటే అది ఒక స్త్రీ యొక్క సర్వనామం అని. మరి – 'చిలక' ఆడదయితే 'రాచిలుక' మాత్రం కాదాయేం ?

కర్త పాడుతున్నాడు : "నేను తుమ్ముతున్నాను. మోమెత్తి చూడు !" అని. చూడవలసింది ఎవరు ? ఒక 'రాచిలుక' – అంటే ఒక స్త్రీ. ఇంతకంటే అఘాయిత్య మేమైనా ఉందా ? చెప్పానుగా ? తుమ్మే టప్పుడు మొహం అష్టవంకర్లుగానూ తయారవుతుంది. కొంచెం అందం గానూ నాజూకుగానూ ఉన్న నా విషయమే అలా అయితే, కొంచెం అటూ ఇటూగా ఉన్నవాళ్ళ సంగతి ఏమిటో చెప్పండి. అందుచేత ఆత్మ గౌరవం ఉన్న ఏ మగవాడయినా ఆడువారి ఎదుట తుమ్మడు. అదే విధంగా ఆడవాళ్ళ సంగతి కూడా.

ఈ పెద్దమనిషి ఈ విధంగా 'తుమ్ముతా !' 'చూడు !' అంటూ పాటలు పాడుతున్నాడా ? మీకో విషయం చెప్పమంటారా ? నే నింత కాలం నుంచీ నా భార్యతో కాపురంచేస్తున్నాను. ఇంతవరకు మే మిద్దరం ఒక రెదురుగుండా ఒకరు తుమ్మలేదు. అంటే అర్థమయిందిగాదూ ? ఒక సారి మాత్రం ఆవగింజంతలో ప్రమాదం తప్పిపోయింది. మా ఆవిడ చాకలాడికి బట్టలు వేస్తూంది. నాకు హఠాత్తుగా తుమ్మువచ్చింది. అక్కడ అలా ఎందుకు తుమ్ము వచ్చిందో నే నింతవరకూ చెప్పలేను. విధికృతం అనుకుంటాను. "ఏమ్ ! పిల్లా డేడుస్తున్నట్లున్నాడు. పోయి చూసిరా !" అన్నాను. "లేదండీ ! ఉయ్యాల్లో పడుకుని నిద్రపోతున్నాడు. ఏడు స్తున్నది పక్కింటివాళ్ళబ్బాయి", అంది నిశ్చలంగా. నాకు తుమ్ము తుఫానులా వస్తోంది. "వంటింట్లోంచి మాడువాసన వేస్తోంది. కూర

పొయ్యిమీద పెట్టి మరిచిపోయి చక్కావచ్చినట్లున్నావు. చూడు" అన్నాను. "లేదండీ! వంటంతా అయిపోయింది. కూర దింపే వచ్చాను" అంది అత్యంత ప్రశాంతంగా! ఆడవాళ్ళు మాత్రమే అంత ప్రశాంతంగా జవాబు లియ్యగలరు ఒక ప్రక్కన కొంపలు ముంచుకొస్తూంటే! వెయ్యి పంజాబు మెయిల్సు పరుగెత్తుకొని వచ్చినట్లుగా వస్తోంది నాకు తుమ్ము. అప్పుడేం చేసేది లేక ఎడంచేతివైపు గుమ్మంలోంచి వెళ్ళి ఉయ్యాల్లో కుర్రాణ్ణి గట్టిగా గిల్లేసి, కుడిచేతివైపు గుమ్మంలోంచి లోపలికి చక్కా వచ్చాను. కుర్రాడు కేరు మన్నాడు. పద్దుపుస్తకం పారేసి, "అయ్యో!" అంటూ పరిగెత్తింది నా యిల్లాలు. "థాం!" అని తుమ్మేశాను నేను. భగవంతుణ్ణి తలచుకున్నాడు చాకలాడు.

ఇదంతా ఎందుకని చెప్పానంటే ఆత్మగౌరవం గల ఏమగాడూ ఆడదాని ఎదుట తుమ్మడానికి యిష్టపడడు. నా సంగతి విన్నారుగా? ఆ కుర్రాడంటే నాకు అపరిమితమైన ప్రేమ. వాణ్ణి చేతులారా గిల్లుతుంటే నేను పడిన బాధ — మొహం, చేతులూ కూడా ఎర్రగా అయిపోయాయి — లోహితాస్యుడిని అమ్మేటప్పుడు డి. వి. సుబ్బారావుగారు కూడా చూపించి ఉండరు. కడుపు తరుక్కు పోయింది. అయితేనేం? ఆత్మ గౌరవం ప్రధానం! దానిముందు ఈ తుచ్ఛ మమకారాలు తొలగి పోవలసిందే!

అంటే కర్తగారిలో ఆత్మగౌరవం లోపించిందని నేను అనను. పాటను నేను బాగా చదివాను. మూలభావాన్ని నేను అర్థంచేసుకున్నానని అనుకుంటున్నాను. ఆ పాటలో ఒక ద్విగుసమాసం ఉంది. (ద్విగు సమాసమేనా అది?) అదే పాటకంతకీ ప్రధాన మయినది. దానిని అర్థం చేసుకుంటే కర్తగారి మనస్తత్వం కూడా చక్కగా అర్థమవుతుంది. ఆ సమాసం ఏదో చెప్పమంటారా? వినండి: అదే "ఒకసారి!"

మీకు తుమ్ముల్లో నమ్మకముందో లేదో తెలియదు. తుమ్ముల్లో ప్రతివాడికీ నమ్మకముంటుంది లెండి ! ఉన్నా. లేకపోయినా తుమ్ము వచ్చినప్పుడు తుమ్మ తీరవలసిందే! నేనడిగేది– ఏదయినా పని మొదలెట్టి నప్పుడు ఎవరేనా తుమ్ముతే పనిపాడవుతుందని ; ఫలానావాడు తుమ్మితే పని నాశన మౌతుందని ఇటువంటి నమ్మకాలు మీకేమైనా ఉన్నాయా ? అని.

మా అన్నయ్యకు తుమ్ముల్లో బాగా నమ్మకం. ఏదైనా పనిచేస్తూ న్నప్పుడు గాని ఎవరైనా తుమ్మేరా ? అంతే ! శాపనార్థాలు పెట్టేవాడు. ఎదుటివాడు చిన్నవాడయితే పైకి ; పెద్దవాడయితే లోలోపల. కాని నా ఖర్మంకాలి, నేను మా అన్నయ్య కంటే ఎప్పుడూ చిన్నవాడినే అయి పోయాను. ఒకప్పుడు అనుకుంటూంటాను : మిగిలిన వాటికోసం కాక పోయినా, అధమం తుమ్ములకోసమయినా నేను మా అన్నయ్య కంటే పెద్దవాణ్ణయితే బాగుండునని !

నేను మీకు చెప్పానుగా— నేను మా అన్నయ్యకంటే చిన్న వాణ్ణని ? ఫలితమేమిటంటే– మా అన్నయ్యను కేంద్రంగా తీసుకుని అర్ధమైలు వ్యాసార్థంతో ఒక వృత్తాన్ని చుట్టి వృత్తంమధ్యలో నే నెక్కడ ఎప్పుడు ఎలాటి పరిస్థితులలో తుమ్మినా మా అన్నయ్య పెట్టే వాడు శాపనార్థాలు. ఒకవేళ ఖర్మంకాలి మా అన్నయ్య తలపెట్టిన పని పెద్దదయినా, లేదా నేను తుమ్మిన తుమ్ము పెద్దదయినా– ఆ వేళకు తూర్పు బెంగాలు శరణార్థుల్లాగ ప్రక్కింట్లో తలదాచుకోవలసిందే !

ఒక రోజున మా తాతగారి ప్రక్కన కూర్చున్నాను. ఆయన పొడుం బాగా పీల్చేవాడు. కళ్ళు చిన్నప్పుడే పోయాయి. నిశ్శబ్దంగా వచ్చి తీసుకుంటే పొడుంకాయ మన స్వాధీనం అయేది. ఒక పట్టు పొడుం తీసి ముక్కులోకి దట్టించాను. నాకేం తెలుసు ? ఆ వేళ పొడుంలో మిరపకాయల పాలు ఎక్కువ అయింది కాబోలు. 'ఢాం !' అని తుమ్మేశాను.

సరిగ్గా మా అన్నయ్య ఎడంకాలుమీద నిలబడి, కుడికాలుతీసి బండిలో పెడుతున్నాడు. వెంటనే ఆ కాలుకూడా కిందపెట్టేసి, పెద్దపులిలా వచ్చాడు లోపలికి. "ఏరా ! తుమ్మడానికి ఇదే సమయం దొరికిందీ ? నేను ఆఫీసుకు పోతున్నాను గదా ! తుమ్మొస్తే లోపలికి పోయి తుమ్మ లేవూ ?" అన్నట్లు శబ్దాలు చేశాడు. ఇంకో నిముషం ఉంటే నాలుగు వేసేవాడే ! ఈ లోపుగా నా చేతిలో ముక్కుపొడుండబ్బీ కనబడింది. ఒక్కసారి ధర్మరాజులా మొహంపెట్టి "పొడుం పీల్చావేమిట్రా ?" అన్నాడు.

నా పరిస్థితి అయోమయంలో పడింది. ముందుచూచిన 'అన్నయ్య'; వెనుక చూచిన 'తాతయ్య.' పీలవ లేదంటే అన్నయ్య మీదపడతాడు ; పీల్చానంటే తాతయ్య వెనకబడతాడు. "ఏమిరా భగవంతుడా ?" అని ఆలోచిస్తూ ఉంటే మళ్ళీ ఇంకో తుమ్ము వచ్చింది. మాఅన్నయ్య చిరు నవ్వులు నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

మా అన్నయ్య చిరునవ్వులు విరజిమ్ముతూ పోడానికి కారణం ఉంది. తుమ్ము ఒకసారి తుమ్మితే ఎంత అపాయమైనా సరే, రెండోసారి తుమ్మేటప్పటికి అదంతా కొట్టుకుపోతుంది. అయితే ముక్కుపొడుం పీల్చిన తుమ్ములు (అంటే అర్థం ముక్కుపొడుం పీలవగా వచ్చిన తుమ్ములు అన్నమాట !) లెక్కలోకి రావు.

ఈ తుమ్ముల్లో నమ్మకం ఉండడంవల్ల, కొన్ని నష్టాలున్నా కొన్ని లాభాలు కూడా ఉన్నాయి. మా తెలుగు మాష్టారుకి తుమ్ముల్లో బాగా నమ్మకం. ఆయన క్లాసులోకి వస్తే ఎక్కడ 'గ్రామరు' చెబుతాడో అని మాకందరికీ భయమేసేది. అందుకని రోజు కొకడు చొప్పున వంతు వేసుకొని హెడ్మేష్టారి గది ప్రక్కగా నుంచునే వాళ్ళం. ఆయన సరిగా క్లాసు కొద్దామని బయలుదేరేసరికి ముక్కుపొడుం దట్టంగాపీల్చి తుమ్మే

వాళ్ళం. ఆయన 'నల్ల' దగ్గరికెళ్ళి కాళ్లు కడుక్కొచ్చేవాడు. పాఠం మొదలెట్టి, దేముణ్ణి తలుచుకుని "రంతుల్ మానుషు కుక్కుటాధమ" అనేసరికి ఎవడో వెనుకనుంచి "ధాం !" అనేవాడు. దాంతో అరగంట వరకు పాఠం ఉపక్రమించేవాడు కాదు మా మాస్టరుసాబ్.

ఇంతకీ మీకు చెప్పదలుచుకున్న దేమిటంటే— ఒకసారి తుమ్మ దానికి రెండుసార్లు తుమ్మడానికి చాలా తేడా ఉందని. ఇది సామాన్యుల విషయంలో. కొందరు పెద్దలుంటారు : వాళ్లు ఒకసారి తుమ్మినా ఒకటే ; పదిసార్లు తుమ్మినా ఒకటే. మా వెంకయ్యగారి తమ్ముడు సంగతి చెప్పాననుకుంటాను. మా ఊళ్లో దుకాణాల వాళ్ళందరూ, ఏదైనా పెద్దబేరం వచ్చినప్పుడు, "వెంకయ్య తమ్ముడు లేడుకదా ?" అని అటూ యిటూ చూసి, మరీ వ్యవహారం జరుపుకుంటారు. అతడు తుమ్మడంలో ప్రపంచానికి ఎంత ప్రమాదం తెచ్చిపెడతాడో — తుమ్మే విధంవల్ల కూడా అంతే ప్రమాదం తెచ్చిపెడతాడు. అంటే మీ కర్థం కాలేదను కుంటాను. మనం రెండు రకాల తుమ్మేవాళ్ళను చూశాం. ( లేదా, విన్నాం. ) ఒక రకం వాళ్లు ' వార్నింగ్ ' ఏమీ ఇవ్వకుండానే 'ధాం' అని తుమ్ముతారు. వినగానే మనకు గుండె ఒకసారి ఆగిపోతుంది : కాని మళ్లీ కొట్టుకోవడం ప్రారంభిస్తుంది. రెండోరకం వాళ్లు రెండంతస్థుల మేడ ఎక్కుతోన్నట్లు తుమ్ముతారు. " హచ్, హచ్ఛ, హచ్ఛ ............ హాచ్ఛ " అంటూ. కాని మా వెంకయ్యగారి తమ్ముడు ఇలాగా కాకుండా, అలాగా కాకుండా, "హచ్ హచ్ఛ హచ్ఛ............ ధాం !" అని తుమ్ముతాడు. అలవాటయిన వాళ్లు తప్ప కొత్తవాళ్లు వస్తే చాలా ప్రమాదకరమయిన విషయం.

వెంకయ్యగారి తమ్ముడు ఒకసారి తుమ్మినాసరే పదిసార్లు తుమ్మినాసరే ఒకటే ఫలితం అని చూసినవాళ్లు (అంటే - అదే - విన్న

వాళ్లు) అందరూ చెప్పుతూంటారు. కాని సామాన్యుల విషయంలో 'ఒకసారి' తుమ్మడం చాలా హానికరమయిన దని ఒప్పుకోక తప్పదు.

ఇందాక చెప్పిన గాయకశిఖామణి పాడాడు : "తుమ్మెదా ఒకసారి" అంటూ. ఒక విషయం ఆలోచించండి. తుమ్మడానికి ముందు ఎన్నిసార్లు తుమ్మగలమో తెలుస్తుందా మనకు ? తెలియదు ; తెలియడానికి అవకాశం లేదు. తుమ్ము ( లేక. తుమ్ములు ) రాబోతున్నది ( లేక, రాబోతున్నాయి ) అని మాత్రం ముందు తెలియవచ్చు. కాని ఒకసారా రెండుసార్లా అన్న విషయం ముందు తెలియదు. అయినప్పుడు ఈ పెద్ద మనిషికి ఒకసారి తుమ్మబోతున్నట్లుగా ఎలా తెలుసు ?

దీని కంతకీ అర్థం ఒకటే ఉంది. ఆ 'రాచిలుక' ఎవరో నాకు తెలియదుకాని ఆ రాచిలుక అంటే ఈ కర్తకు యిష్టం లేదని మాత్రం నాకు తెలుసు. ఆమె అంటే ఇతనికి పడదు ; ఆమె పని పాడుచెయ్యాలని నిశ్చయం చేసుకున్నాడు. అతనికి తుమ్ముల్లో నమ్మకం ఉందా లేదా అన్నది సందేహాస్పదమైన విషయం ; ఆమెకు నమ్మకం ఉందా లేదా అన్నది కూడా సందేహమే. నమ్మకం ఉంటే తుమ్ముయొక్క ఫలితం ప్రత్యక్షంగా కనిపిస్తుంది ; లేకపోతే పరోక్షంగా కనపడుతుంది. నాకు మటుకు పిచ్చినమ్మకాలు వేటిల్లోను – తుమ్ములతోసహా – నమ్మకంలేదు. అయినప్పటికీ, వెంకయ్యగారి తమ్ముడు తుమ్మితే కాస్త కాళ్లు కడుక్కొని మరీ చేస్తాను ఏ పనయినా ! అందుచేత తుమ్ముల్లో నమ్మకం లేకపోయినా మనం ఏదయినా పని ప్రారంభిస్తోన్నప్పుడు ఎవరైనా తుమ్మాలని మనం అనుకోంగదా ! అదే విధంగా పాపం ఆ 'రాచిలుక' ఏదైనా శుభకార్యం ప్రారంభిస్తోన్నట్లుంది. అది పాడు చేద్దామనే ఉద్దేశ్యంతో ఈయన "తుమ్మెదా !" "తుమ్మెదా !" అంటూ పాడుతున్నాడు. నిజంగా తుమ్మినా తుమ్మకపోయినా ఈ బెదిరింపులకు ఆ

'రాచిలుక' మనస్తత్వంలో మార్పులు ఏప్పడి పని పాడుచేస్తుందనడంలో సందేహంలేదు. అందులో ఒకసారి తుమ్ముతాననడం !

ఇది సమంజసం అని ఎవరూ అనలేరు. భారతరాజ్యాంగం ప్రకారం అందరికీ ప్రాథమిక హక్కులున్నాయి. ఇంకొకరి హక్కులకు భంగం కలగనంతకాలం తోచినది మాట్లాడవచ్చు ; వ్రాయవచ్చు ; ఉపన్యసించ వచ్చు. అదే విధంగా యిష్టం వచ్చినన్నిసార్లు తుమ్మవచ్చు కూడా ! కాని ఈ తుమ్ముల్ని 'యితరులకు నష్టం కలగాలనే ఉద్దేశ్యంతో, తన తుమ్ములవలన యితరులకు నష్టం కలగవచ్చునని తెలిసి కూడా ఉదాసీనభావంతో' ఉపయోగించడం రాజ్యాంగం సహించదు. ఎవరైనా ఉన్నత న్యాయస్థానానికి పోతే తప్పక నెగ్గుతారు.

నేను కర్తను ప్రార్థిస్తున్నానూ : ( ఆయన ఎవరో నాకు తెలియదు) నేను కర్తను ప్రార్థిస్తున్నాను : ఈ విధంగా – దురుద్దేశ్యంతో – 'ఒకసారి' తుమ్మడం తగదు ! అసలు సాధ్యమయినంతవరకు తుమ్మనే తుమ్మవద్దు. కాని తప్పనిసరి అయితే అధమం రెండుసార్లేనా తుమ్మాలి ! కర్తగారు నా మాటల్లోని సహృదయత్వాన్ని అంగీకరిస్తారని ఆశిస్తున్నాను. అతి త్వరలోనే "తుమ్మెదా రెండుసార్లు........" అంటూ పాటను వినే అవకాశం కలుగుతుందని విశ్వసిస్తున్నాను.

[ 1955 ]



# 3

## పెండ్లి పరీక్ష

నేను : అయ్యల్లారా! అమ్మల్లారా! అన్నల్లారా: అక్కల్లారా! మీ కందరికీ ఓ నమస్కారం. ఒకటి కాదు - వెయ్యి నమస్కారాలు. మీరు నా పెళ్ళివిషయంలో తీసుకున్న, తీసుకుంటూన్న శ్రద్ధకి నేను సదా కృతజ్ఞుణ్ణి మీకు. మీరు నన్ను రైళ్లల్లో గోత్రా లడిగారు ; ఉత్తరాల్లో అభిప్రాయా లడిగారు. అప్పుకోసం చేయి చాస్తే, జాతకం చూసి, శీఘ్రమే కళ్యాణసిద్ధిరస్తు అని దీవించారు. నా పెళ్ళి జరక్క పోతే సూర్యుడి చుట్టూ భూమి తిరగదేమో అన్నట్టు, ప్రశ్నలవర్షం కురిపించారు. మీ కందరికీ నా కృతజ్ఞతలు. ఇవే నా కృతజ్ఞతలు.

'ఏం పని చేస్తున్నావబ్బాయి?' అని ప్రశ్నించారు మీరు. ఆ ప్రశ్నకు అర్థం నాకు తెలుసు. 'నీకు పెళ్ళయిందా?' అన్న ప్రశ్నకు అది ఒక రహదారి. మహా భేషైనరహదారి.

'నీకు పిల్ల లెంతమందోయి ?' అన్నారు మీరు. ప్రశ్న వేసి, ఓపిగ్గా నిలబడ్డారు — నాకు పెళ్ళ యిందో లేదో కను క్కుందామని. 'పిల్లల్లేరండీ' అంటే పెళ్ళికాలేదనుకొని గోత్రా లడిగారు. పేరు, ఇంటిపేరు అడిగారు. సోదర సోదరీ మణులారా : మిమ్మల్ని నిరాశాసర్వభ్రష్టుల్ని చేయడం నాకు ఇష్టంలేదు. కాని, నాకు పెళ్ళి ఎన్నడో ఐపోయింది. మా ఆవిడ, 'బుద్ధిమంతురాలు. చదువు కొన్నది, అందమైనది. వంట వచ్చు, పాట వచ్చు. ఇప్పటి కాలపు పిల్లల్లా కాకుండా కొంచెం సిగ్గు, లజ్జ, అభిమానం ఉన్న పిల్ల'. ఈ అభిప్రాయం నాది కాదు, పెళ్ళి కాక ముందు—నా పెళ్ళి కాకముందు —మా అమ్మ నా ప్రయోజనం కోసం ప్రతిదినం, ప్రతిక్షణం, ప్రసారం చేసిన ప్రకటనలో అంశం.

పెళ్ళిని గురించి మీరే కాదు — నేనూ కలలు కన్నాను. మీరూ కలలు కంటారని ముందే అనుకున్నాను. కాని — నా పెళ్ళిని గురించి మీ రందరూ కలలు కంటారని ఊహించ లేకపోయాను. నాకు పద్దెనిమిదో ఏడు వచ్చిననాడు మా అమ్మ గొడవ ప్రారంభించింది. మా అమ్మ గొడవ ప్రారంభించిన ద్వితీయ వార్షికోత్సవానికి మా నాన్న ప్రారంభించాడు. మధ్యలో ఎక్కడో మా మామయ్య ప్రారంభించాడు.

అమ్మకంఠం : అబ్బాయ్!

నేను : వస్తున్నా నమ్మా.

అమ్మ : ఆయన మళ్ళీ ఉత్తరం రాశార్రా.

నేను : ఎవరే ?

అమ్మ : ఆ వెంకటాయపురం సంబంధం ఆయన. వాళ్ళకి నువ్వు నచ్చావుట. అమ్మాయి కూడా తలూపిందట. డబ్బుకి డబ్బూ ఉంది, చదువుకి చదువూ ఉంది. ఆరు వేలకు తక్కువ కాకుండా కట్నం, లాంఛనాలు ఇస్తారట...

నేను : స్టాప్...ఫుల్‌స్టాప్ !...దానికో వేళా పాళా లేదుటే అమ్మా ? ఎప్పుడూ పెళ్ళేనా ? శ్రీరామచంద్రుడంతటివాడు ఒక్క సారి పెళ్లి చేసుకున్నాడు. నేను అవతల పెద్దమనుషుల్తో మాట్లాడుతున్నా గదా ? కొంత సేపు ఆగలేవూ ?

ఆ క్షణంలో నేను - ఇప్పట్లాగే - పెద్దమనుషుల్తో మాట్లాడుతున్నానండి. కాని మా అమ్మ వింటేగా ? మా అమ్మ సాధించడం ప్రారంభించింది.

అమ్మ : నువ్వు పెద్దమనుషుల్తో మాటాడంది ఎప్పుడు ? (ఏడుపు స్వరంతో) ఏదో నేను బ్రతికుండగానే ఆ మూడుముళ్లూ పడిపోతే చూద్దామని. అంత అదృష్టం ఉండొద్దూ ? వెంక టాద్రిమయ్యగారి అబ్బాయికి మహా వైభవంగా ఐదురోజులు పెళ్లి చేశారు. అవధానిగారి అబ్బాయికి ముప్పైరెండువేల కట్నం ఇచ్చారు. 'మీ గుమ్మానికి మామిడాకులు ఎప్పుడు కడతావమ్మా ?' అని అందరూ నన్ను కొరుక్కు తింటు న్నారు...

నేను : ఇదండీ వరస. ఆడవాళ్లు సాధిస్తూ కూచుంటారు. లేకుంటే ఏడ్చి సాధిస్తారు. దీనికో మితి అంటూ లేదు, వేళా పాళా లేదు. నా జీవితంలో ప్రతి క్షణమూ ఇదే గోల. ప్రతీ వాళ్లు నా పెళ్లిని గురించి ప్రశ్నించేవాళ్లే. ప్రపంచంలో

ప్రశ్నలన్నీ పెళ్లి దగ్గరే తేల్తోన్నట్టు కనిపించింది చివరికి. రైల్వేవాళ్లలాగ, ఆలిండియా రేడియో వాళ్లలాగ ఈ పెళ్లి ప్రశ్నలకు ఒక టైం అంటూ నిర్ణయిస్తే బాగుండు నని పించింది. 'ప్రతిరోజూ సాయంత్రం ఆరుగంటల నలభై ఐదు నిమిషాల నుండి ఏడు గంటల పదిహేను నిమిషాల వరకు - పెళ్లి ప్రశ్నలు - కార్యక్రమం ... మీటర్లు ...కిలోసైకిల్సుపై ప్రసారం అని ప్రకటిస్తే బాగుండు ననిపించింది.

వెంకటాయపురం అమ్మాయి చదువుకున్న అమ్మాయే. అందంగానే ఉంటుంది. 'బుద్ధిమంతురాలే' అంది మా అమ్మ. చదువుకున్న తర్వాత ఇంకా బుద్ధేమిటి? అహం. మాటవరసకి చెబుతున్నాను. నేనూ, మామయ్యా పిల్లను చూడ్డానికి వెళ్లాం. అక్కడేం జరిగిందో తెలుసా? ఒక్క నిముషం ఆగండి. జస్ట్ వన్ మినిట్. అంతా నెమరేసు కోవాలి మరి....

మామయ్య: ఒరేయ్! రాముడూ...

నేను: ఏం మామయ్యా?

మామయ్య: సరిగ్గా కూచోరా... ఠీవిగా కూచో.... కాలుమీద కాలేసుకు కూచో. అలా చాకలి పేరిగాడిలా కూచుంటే ఎలా?

నేను: నేనేం చాకలి పేరిగాడిలా కూచోలే.

మామయ్య: కూచోలే? కూచున్నావు కనుకనే అంటున్నా. ఠీవిగా కూచో మంటున్నా. మగవాళ్లు ఠీవిగా ఉంటే ఆడవాళ్లు ఇష్టపడ తార్రా...

నేను : మామయ్యా! ... ఈ పెళ్లి నాకా? ఆ అమ్మాయికా???

మామయ్య: అదేవిట్రా నీ మొహం?

నేను : అహఁ అదికాదు. ఈ పెళ్లిచూపులు ఆ అమ్మాయికా? నాకా? అని.

మామయ్య: అంత గట్టిగా మాటాడకురా—వాళ్లు వింటారు. పెళ్లిచూపులు ఇద్దరికీను. నువ్వా అమ్మాయిని చూస్తుంటే, ఆ అమ్మాయి నిన్ను చూసేస్తుంది.

నేను : అమ్మ బాబోయ్. ఐతే - నే నా అమ్మాయివంక చూడనే చూడను.

మామయ్య: ఇదేం ఖర్మంరా? నువ్వా అమ్మాయిని చూడాలిరా. మనం ఇక ఇంత దూరం ఎందుకొచ్చాంరా? ఆ అమ్మాయిని చూడ్డానికేగా?

నేను : నువ్వు కూడా — నువ్వు కూడా చూస్తావా ఆ అమ్మాయిని?

మామయ్య: చూడ్డానికేగా మీ నాన్న పంపించింది నన్ను?

నేను : ఆ అమ్మాయి నిన్ను కూడా చూస్తుందా? నన్నొక్కణ్ణే చూస్తుందా?

మామయ్య: నన్నూ చూస్తుంది, నిన్నూ చూస్తుంది. నిన్ను చూసీ చూడనట్టు చూస్తుంది. నన్ను మామూలుగా చూస్తుంది.

నేను : నిన్ను చూస్తే నన్ను పెళ్లి చేసుకోనంటుందేమో?

మామయ్య: అంత ఘోరంగా ఏమీ లేను నేను. మీ అత్తయ్య నన్ను చూసే చేసుకుంది.

నేను : అత్తయ్య చదువుకోలేదుగా? ఈ అమ్మాయి చదువుకున్న పిల్లాయె.

మామయ్య: ఆఁ. ఈ కాలపు చదువులు కూడా చదువులే ? ఈ కాలంలో పిల్లలు మరీ గడుసుబారి పోతున్నారు.

నేను : అదే, మామయ్యా, నేనూ అంటున్నాను. పెళ్లీ వద్దు, పెటాకులూ వద్దు. వాళ్లు ఇంకా బయటికి రాకముందే లెఫ్ట్ రైట్ కొట్టేద్దాం పద.

మామయ్య: బాగానే ఉందే వ్యవహారం. మీ నాన్న మనిద్దర్నీ నిలువునా చీల్చిపారేస్తాడు.

నేను : అమ్మ కాశీకి పోయి నూతులో దూకుతుందికదూ ?

మామయ్య: ఒరేయ్. వాళ్లొస్తున్నారు ...

[ లోపల గుసగుసలు ]

....మాటలు వినపడుతున్నాయి, టిఫిన్ పట్టుకొస్తారు. దున్నపోతులా తినక, నాజూగ్గా ఓ ముక్క కొరికి విడిచి పెట్టు.

నేను : లేకపోతే - నేను తింటా నేమిటి ? వెధవ చెత్త. ఈ రోజుల్లో వేరుశనగనూనెతో చేస్తున్నారు మరీను. ఒక్క మైసూర్‌పాక్ తెస్తే మాత్రం విడిచిపెట్టేది లేదు. దున్నపోతు, గిన్నపోతూ జాంతా నై.

మామయ్య: ష్. గట్టిగా మాటాడకురా; గట్టిగా మాటాడకు.

[ లోపల్నించి ]

అమ్మాయి తల్లి : చూడమ్మా ! పొదుపుగా కూచో. నా తల్లికాదూ ? అడగందే ఏ సమాధానం చెప్పకు.

అమ్మాయితండ్రి:-నీకు సిగ్గూ ఎగ్గూ లేదని నాకు తెలుసులే తల్లీ. ఒక్క-సారి సిగ్గు నటించు. నా కోసం. నీకు దండం పెడలా.

తల్లి : ఉండండీ, మీరు మరీను. అమ్మాయి అసలే బెంబేలుపడుతూంటే – మీరు మరీ అంత గొడవ చేస్తారేమిటీ ?

తండ్రి : లేకపోతే ఏమిటే – ప్రాణం విసిగిపోతుంటేనూ ?

అమ్మాయి: నాకీ పెళ్ళిచూపులొద్దమ్మా. మీరు సరిగా మాటాడనివ్వరు. సంత కెళ్ళి పశువును చూసినట్టు ఏమిటీ పరీక్షలు ?

తల్లి : ష్ ! గట్టిగా మాటాడకమ్మా-నీకు పుణ్యముంటుంది. వాళ్ళకి వినపడుతుంది.

తండ్రి : (గట్టిగా) రాముడూ, ఒరేయ్ రాముడూ.

తల్లి : (గట్టిగా) అలా బజారెళ్లాడండీ. ఆకులు తెస్తాననీ.

తండ్రి : (గట్టిగా) ఎంతమంది నౌకర్లున్నా – వొక్క-డూ సమయానికి కనపడ్డు ... ఫలహారం సంగతేం చేశావ్ ?

తల్లి : అన్నీ సిద్ధంగానే ఉన్నాయ్, మీరేం కంగారు పడకండి.

నేను : మామయ్యా ?

మామయ్య: ఏరా ?

నేను : వాళ్లు ముందొస్తారంటావా ? టిఫిన్ ముందు పట్టుకొస్తారంటావా ? ... ఆ అమ్మాయి చూస్తుంటే నేను తినలేను, మామయ్యా.

మామయ్య: నీకు పుణ్యముంటుంది, మాటాడకురా.

నేను : అది కాదు, మామయ్యా....

మామయ్య: ఏమిట్రా ?

నేను : వాళ్లు మైసూర్‌పాక్ పెడతారంటావా ?

మామయ్య: గట్టిగా మాటాడకురా.

నేను : మైసూర్‌పాక్ పెడితే వదల్లేను, మామయ్యా!

మామయ్య: ఏవిటండోయ్ వదినగారు? ఏవేవో తెచ్చేస్తున్నారు. అబ్బెబ్బే – ఇంత గొడవ చేస్తున్నారేమిటి?

తల్లి : ఏవుందిలెండి? ప్రత్యేకం మీ కోసం ఏమీ చెయ్యలేదు. మీ అన్నగారికి రోజూ ఏదో ఒకటి చేస్తేనేగాని కుదరదు.

తండ్రి: బావుందే. మధ్య నన్ను ఇరికిస్తావు దేనికి? ఏదో పిండి వంటలు చేసి, కాబోయే అల్లుణ్ణి మభ్యపెట్ట దలచుకున్నావ్ కాబోలు.... తినవోయ్.

నేను : ఉహూ – తింటాలెండి.

మామయ్య: ఈ మధ్య మావాడు మరీ నాజూగ్గా తయారయ్యాడు లెండి. ఈ కాలపు చదువుల్తోవచ్చే తంటాయే ఇది. 'మైసూర్‌పాక్ తినరా' అంటే 'విటమిన్లుంటాయా దాంలో?' అంటాడు.

తల్లి : తీసుకో నాయనా.

నేను : ఊఁ – తీసుకుంటాలెండి.

మామయ్య: అమ్మాయొస్తేగాని తిండేమో! ఏంరా? అమ్మాయొస్తేనే గాని తినవా ఏమిటి?

తండ్రి : అమ్మా యొచ్చింతర్వాత మళ్ళీ ఇంకోసారి తినవచ్చు! అహ్హహ్హ. ఏమంటారు అన్నగారు? అహ్హహ్హ...

తల్లి : ఏవిటండీ మీ వేళాకోళాలు మరీను – అసలే అతగాడు మొహమాటపడుతూంటే?

తండ్రి : అమ్మాయిని రమ్మనవే. లోపల అలా సిగ్గుపడుతూ కూచుంటే ఎలా?... తినవోయ్.

నే ను :   అహఁ. తింటా లెండి.

త ల్లి :   (లోపల్నించి) పదవే పద. కొంచెం బుద్ధిగా ప్రవర్తించు. ఈ సంబంధం కూడా పోయిందంటే నాన్నగారు ఉరేసుకుంటారు...

తండ్రి :   (గట్టిగా దగ్గుతూ) వెధవది దగ్గు పట్టుకుంది. వర్షాలండీ. చంపేస్తున్నాయ్. విడవకుండా కురిస్తే ఎలా చావడం చెప్పండి.

మామయ్య:   కాదుటండీ మరీ ? నిన్న రైల్లో వస్తూంటే— ఒకటే వర్షం. డ్రైవరుకి దారెలా తెలిసిందా అని ఆశ్చర్యమేసింది. కుడి చేతి పక్కకు తిరగడానికి బదులు ఎడం పక్కకు తిరిగాడో గోవిందా — గోహో వింద !

తండ్రి :   అహ్హహ్హ. బాగా చెప్పారు....రా, అమ్మా, రా.... అలా కూచో. ఈ అమ్మాయే మా అమ్మాయి. పేరు రమ.....

మామయ్య:   పేరు కేం ? బంగారంలా ఉంది.

తండ్రి :   బి. ఏ. దాకా చదివింది. ఈవాళో రేపో రిజల్ట్సు రావాలి.

మామయ్య:   ఇది నవంబరు కాదూ ? రేపో ఎల్లుండో వస్తాయి, పేసవుతుంది లెండి. సెప్టెంబరులో కూచుందన్నమాట.

తండ్రి :   మార్చిలో సరిగ్గా పరీక్షల సమయానికి మలేరియా పట్టుకొందండీ....

త ల్లి :   మలేరియా కాదండీ.... మామూలు జ్వరమే.

తండ్రి :   మలేరియా అన్నాడుగా డాక్టరు ?

త ల్లి :   మీరొహరు. ఆ డాక్టరుకేం తెలుసండీ మనమ్మాయి సంగతి?

మామయ్య: డాక్టర్లంతే లెండి. నాలుగుడబ్బులు రాబట్టుకొందామని మాయదారిపేర్లన్నీ పెడతారు.

తండ్రి : ఐనా, ఈ కాలపుపిల్లలందరూ అంతేలెద్దురూ ? ఆరోగ్యం సరిగ్గా కాపాడుకోరు.

తల్లి : అదేమిటండీ అల్లాంటారు ? దాని కెపుడైనా జ్వరం వచ్చెరుగునా ? దాంది బంగారంలాంటి శరీరం.

తండ్రి : నిజమేనండోయ్. మర్చిపోయాను. దాంది బంగారంలాంటి శరీరమే. అరెరే. 'మర్చిపోయాను' అంటే జ్ఞాపకమొచ్చింది. అసలు సంగతే మర్చిపోయాను...అమ్మాయి ! అతడు కామేశ్వర్రావు, ఎమ్. ఏ. పేసయ్యాడు. పేసయ్యాట్ట.

అమ్మాయి: నమస్కారమండీ.

నేను : నమస్తే. బావున్నారా ? ఐ మీన్ బావున్నావా ? అదే. నమస్తే. నమస్తే.

అమ్మాయి: ఏఁవిటన్నారు ?

నేను : అబ్బే. ఏవీఁ అన్లేదే. నమస్తే అన్నాను.

తండ్రి: అమ్మాయి, చూడమ్మా. ఈయన వెంకట్రావుగారు. అతనికి మేనమామ. సొంత మేనమామ.

అమ్మాయి: నమస్కారమండీ.

మామ : శీఘ్రమే కళ్యాణ సిద్ధిరస్తు.

తండ్రి: కరెక్టు. అన్నారూ. నేననుకుంటూనే ఉన్నాను. మీరలా దీవిస్తారని. అహ్హహ్హా.

మామ : మరి మేం వచ్చిందే దానికన్దండీ ? ఏఁవంటారు ?

తండ్రి: బాగా చెప్పారు. అహ్హహ్హ....బాగా చెప్పారు....చూడండి, అన్నగారూ. మీరు మా ఇల్లు చూడలేదనుకుంటాను. అల్లా చూసొద్దాం, ఏఁవంటారు ?

మామ : ఇంక మీ ఇల్లు మా ఇల్లే. ఎన్నిసార్లు రాము ? చూద్దాం లెండి...అమ్మాయి, నువ్వు పాట పాడగలవా, అమ్మా ? సినీమా పాట అయినా సరే.

తల్లి : అమ్మాయికి త్యాగరాజకీర్తనలు వచ్చు. పాడమ్మా.

అమ్మాయి: ఏం పాడమంటావే ?

తండ్రి: 'నను పాలింపగ నడచి వచ్చితివా' పాడు. బాగుంటుంది. సమయానికి తగ్గట్టుగా ఉంటుంది.

మామ : మేము నడిచి రాలేదండోయ్.

తండ్రి: అబ్బ ! మీ సంగతి కాదండీ. అర్థం చేసుకోరేం ?

తల్లి : ఏఁవిటండీ మీరు మరీను ? వాళ్ల కిష్టం వచ్చిన పాటలు వాళ్లు పాడుకుంటారు. బావగారికి ఇల్లు చూపిస్తామన్నారు. మర్చిపోయారేమిటి ?

తండ్రి : ఔనండీ. మరీ మరుపు ఎక్కువై పోయింది !

మామ : చూడమ్మా మావాడికి మొహమాటం ఎక్కువ. సిగ్గుపడి ఆ మైసూర్‌పాక్ విడిచేయగల్డు. పదండి అన్నగారూ....

[ ఒకింత నిశ్శబ్దం...తరువాత అమ్మాయి నవ్వు ]

నేను : నవ్వుతారేమిటి ? నవ్వుతావేమిటి ? (అమ్మాయి నవ్వుతుంది) నవ్వితే నాకోపం వస్తుంది.

అమ్మాయి: మీరల్లా చూస్తారేమిటి నా వైపు ? పరీక్ష పేసయ్యానా నేను ?

నేను : నే నేం పరీక్షగా చూట్టల్లేదు.

అమ్మాయి: ఓహో . . .

నేను : నువ్వు చూడకపోతే నీ కెలా తెలిసింది. మీ కెలా తెలిసి సింది— నీకు ?

అమ్మాయి; ఆయన మీ మామయ్యగారా ?

నేను ; నాకు సొంతంగా మేనమామ. మా అమ్మకు అన్న. మా అమ్మ నాకు సొంతంగా అమ్మ (అమ్మాయి నవ్వుతుంది) ...ఏమిటా నవ్వు ?

అమ్మాయి: మీ అమ్మ మీకు సొంతంగా అమ్మ అంటేను...

నేను : (నవ్వు) ఓహ్హో అదా ? అహ్హహ్హ...

అమ్మాయి: మీకు పాట వచ్చా ?

నేను : నాకా ?

అమ్మాయి: మీకే !

నేను : వచ్చునంటే వచ్చు ననుకో. అది నీకు నచ్చుతుందో లేదో అనుమానం. పాడమంటే పాడతాను. పాడమంటారా ?

అమ్మాయి: వొద్దులెండి. మీకే అంత అనుమానంగా ఉంటే — పాడక పోడమే మంచిది.

నేను : అనుమానం ఏమీ లేదులే. నువ్వుకూడా కోరుతున్నావు కాబట్టి పాడేస్తాను. నే నిప్పటికి ఎంతో మందిని చూశాను. పెళ్లి కూతుర్లని! ఎంతమందినో అంటే ఆర్టేమందిని

కాదులే. పాటపాడమని నన్ను ఎవరూ అడగలేదు, ఇంత వరకూ. అడిగిన తర్వాత పాడక పోవడం అన్యాయం.

[ దగ్గు ]

అమ్మాయి: ఆగండి. పాడితేనే అన్యాయ మౌతుందేమో ?

నే ను : ఏమీ కాదు. వొక్కటంటే వొక్కటి. నేను పాట పాడినప్పుడల్లా మా అమ్మ 'హరహరా' అంటూ చెవులు మూసుకుంటుంది. ఇప్పటివరకూ మా అమ్మకు వచ్చిన పుణ్యం ఇంతా అంతా కాదు.

అమ్మాయి: అటువంటి పుణ్యం నాకేం అక్కర్లేదు కాని— మీరు చదువుకున్నారా ?

నే ను : చదువుకున్నానా అంటే చెప్పలేను. పరీక్షలు చాలా పేసయ్యాను...

అమ్మాయి: అవి లెక్కలోకి రావు లెండి.

నే ను : ఫెయిలవడం కూడా లెక్కలోకి రాదా ?

అమ్మాయి : మీరు ఫెయిలయ్యారా ?

నే ను : ఓ. చాలా. వొకటి కాదు, రెండు కాదు పేసయిన ప్రతి పరీక్షకీ ముందు రెండుసార్లు ఫెయిలయ్యా......

అమ్మాయి: ఫెయిలవటం మీ తెలివి తేటలేనా ? పేపరిచ్చినవాళ్ళ...

నే ను : నావీ వాళ్ళవీ కూడా. అది మామూలుపరీక్షల సంగతనుకోండి. పెళ్లి పరీక్షల్లో ఫెయిలవడం నా తెలివి తేటలే. ఇప్పుడు మాత్రం—

అమ్మాయి: ఇప్పుడు మాత్రం ?

నే ను : ఇప్పుడు— నీ తెలివితేటలవల్ల నేమో అనిపిస్తోంది.

అమ్మాయి: ఐతే— మొత్తమ్మీద ఫెయిలయిపోయినట్టే అంటారు.

నే ను : కాదంటావా ?

అమ్మాయి: ఏదో ముప్పై ఐదు మార్కులొచ్చాయి. మరో ఐదొస్తే పేసు. అమ్మా, నాన్నా మోడరేషన్ బోర్డులో ఉన్నారు.

నే ను : అంతా తమాషాగా ఉంది.

అమ్మాయి: ఏమిటి ?

నే ను : నా కంటె నీ పనే బాగుంది. క్రమశిక్షణకు విరుద్ధంగా నడిచినందుకు మార్కులు తగ్గించేశాను. కూడితే — ఏ ఇరవై మార్కులో రావాలి. ఐనా— ఎటు కూడినా నలభై ఐదు వస్తున్నాయి. ఇదేం ఇంద్రజాలమో మరి ? —ఐతే చూడు...

అమ్మాయి: ఏమిటి ?

నే ను : ఇద్దరం పేసయినట్టేగా ? ... ... మరి ఆ మైసూర్‌పాక్ తినొచ్చా ?

అమ్మాయి: మీ కిష్టమా ?

నే ను : ఇష్టమే గాని మా మామయ్య తినొద్దన్నాడు. 'దున్నపోతులా తినకు' అన్నాడు.

అమ్మాయి: మీరు అలా – అలా తింటారా ?

నే ను : అబ్బే. చాలా నాజూగ్గా తింటాను. అసలు మైసూర్‌పాక్ దున్నపోతులా తినటం ఇంపాజిబుల్ తెలుసా ?

అమ్మాయి: అవి నేనే చేశాను. తినండి. ఆ ఐదూ నేనే కలిపేస్తాను.

నే ను : థేంక్యూ. మరి నువ్వుకూడా తీసుకో.

అమ్మాయి: మా అమ్మ కోప్పడుతుంది. సిగ్గు పడమని మరీమరీ చెప్పింది.

నే ను : మన సంగతి చెప్పడ మెలా ?

అమ్మాయి: నాకు్కదరదు. నేను ఆడపిల్లని. మీరే చెప్పాలి. మీరే ఆలోచించండి.

నే ను : అలవాటు లేదే ?

అమ్మాయి: ఏమిటి ?

నే ను : ఆలోచించడం.

[ అమ్మాయి నవ్వుతుంది. నేనూ నవ్వుతాను. మామయ్యా, తల్లీ, తండ్రీ అందరూ నవ్వుతారు ... గందరగోళం ... నిశ్శబ్దం ... ]

నే ను : చూశారా, సోదర సోదరీ మణులారా ? ఆ విధంగా ఐపోయింది పరీక్ష. ఆ విధంగానే ఐపోయింది పెళ్లి. మీరు నన్నింక పెళ్లి చేసుకోమని అడక్కండి. వింటే _ కొంప ముంచేస్తుంది మా ఆవిడ ... !

[ 1958 ]



# కుక్కలే కాదు:
# మొరిగేవి ఏవీ
# కరవ్వు!

## 4

కుక్కలే కాదు – మొరిగేవి ఏవీ కరవ్వు అని నా దృఢవిశ్వాసం. మొరిగే కుక్కలు కరువనేరవు అని అందరూ ఒప్పుకుంటారు కదా? అలా ఒప్పుకోకపోయినా, మొరిగే కుక్కలు మొరిగేటప్పుడు కరవ్వు అని; కరిచే కుక్కలు కరిచేటప్పుడు మొరగవనీ ఒప్పుకుంటారు. ఐతే – నా ఉద్దేశ్యంలో మొరిగేవి ఏవైనా కరవనే కరవ్వు – మనుష్యులైనా సరే, కుక్కలైనా సరే, మరేవైనా సరే! కమ్యూనిస్టుల సంగతి తీసుకోండి. కరిచినంతకాలం కరిచారా? మొరగడానికి అవకాశం దొరకగానే కరవడం మానేసి, మొరగడం ప్రారంభించారు. మరి బడి పంతుళ్ళు కరవలేక పోడానికి కారణం పొద్దున్నుంచి సాయంత్రం వరకూ అరుస్తూ ఉండటమే. ఈ అరిచే అవకాశమే (ఈ మొరిగే అవకాశమే) కుర్రాళ్ళకివ్వండి: మాస్టర్లను కరవటం మానేస్తారు. అసలు ఈ థియరీ, విశాల హృదయంతో పరిశీలిస్తే, ఆంధ్రులందరికీ వర్తిస్తుంది. వాళ్ళు (–అంటే మనం అన్నమాట) ప్రతి విషయంపైన మొరిగినంత కాలం మొరుగుతారు; తీరా సమయం వచ్చేసరికి కరవకుండా

పోతారు. మిగిలినవాళ్ళు ( - అంటే ఎవరో తెలుసుగా ? ) సమయం వచ్చేవరకు నిశ్శబ్దంగా ఉండి, తటాలున కరిచేస్తారు.

అయితే - పూర్వం ఈ థియరీలో నా కసలే విశ్వాసం ఉండేది కాదు. నా కీ దృఢవిశ్వాసం ఎలా కలిగిందా అనేది ఓ పెద్ద కథ. మీరు ఓపిక పడతానంటే ఒక్క నిమిషంలో చెప్పేస్తాను. మహాఐతే పదిహేను నిముషాలు.

పూర్వం నేను నాలుగు రోజుల పాటు మేష్టరీ చేశాను. సరిగ్గా మొదటి రోజునే ఏం జరిగిందంటే —— ఒద్దులెండి ! ఇక్కణ్ణించి చెబితే మీ కేమీ అర్థం కాదు. మొదట మా అన్నయ్యగారి బాపూ ఏమన్నాడో చెబుతాను. అక్కణ్ణించి చెబితే మీకు బాగా అర్థ మౌతుంది ......

మా అన్నయ్యగారి రెండో అబ్బాయి బాపూ ఒకసారి నూతికి ఒక గట్టు మీద నిలబడి - రెండో గట్టుమీదకు తను దూకగలనని తన కంటె చిన్నకుర్రాళ్ళకు నిరూపిద్దామనే ప్రయత్నంలో ఉండగా - మామ గారికి తెలియకుండా ముక్కుపొడుం పీలుద్దామని కిటికీదగ్గర కొచ్చిన మా అన్నయ్య చూశాడు. కోపం వస్తే మా అన్నయ్య వీపు చిట్లకొడతాడు. అదే ! ఎవరిమీద కోపం వచ్చిందో వాళ్ళ వీపు ! గూఢ చారుల వలన విష యం తెలుసుకున్నాడు మావాడు. తెలుసుకొని, తీరుగా వంటింట్లోకి పోయి వంటావిడ వెనకాల నిలబడ్డాడు. మా వంటావిడ రాజమ్మగారి వెనకాల నిలబడ్డానికి ఎప్పుడూ ఇద్దరు ముగ్గురికి చోటుంటుంది. మా అన్నయ్య- ముద్దాయి కపపడక పోయేసరికి - సాక్షుల వీపులు రెండు చిట్లకొట్టి వెళ్ళి పోయాడు. బాపూ నా దగ్గర కొచ్చాడు.

ప్రమాదకరమైన పనులు చేయగా మిగిలిన కాలాన్ని బరువైన వాక్యాలతో నింపడం మా బాపూకి అలవాటు. వాడు నాదగ్గర కొచ్చి

అన్నాడు : 'పెద్దవాళ్ళు ఒకప్పుడు తాము కూడా చిన్నవాళ్ళమని గ్రహించి ప్రవర్తించాలి' అని. నాకు తలకోపం తోక్కొచ్చింది. 'చిన్నవాళ్ళు కూడా ఒకప్పుడు పెద్దవాళ్ళ మౌతామని గ్రహించి ప్రవర్తించాలి' అన్నాను తీక్షణంగా. మా వాడు నెమ్మదిగా జారుకున్నాడు.

నాకైతే కోపం వచ్చింది కాని - మరెవరైనా ఐతే మా వాడి మాటలకి విరగబడి నవ్వేవారే ! నాకు కోపం రావడానికి కారణముంది. ఒకప్పుడు నేనూ చిన్నవాణ్ణే. అంటే వయస్సులో. మా నౌఖరు వెంకన్న బజారు కెళ్ళేటప్పుడు, నన్ను భుజంమీద కూచోపెట్టుకు తీసుకెళ్ళేవాడు. 'నువ్వు కలకటేరు వవుతావా? ....... మేస్ట్రీటు చేస్తా... వా ?.. .మున సబుగిరీ చేస్తా...వా ?' అంటూండేవాడు. నేను మేష్టరీ చెయ్యవలసి వస్తుం దని వాడు కలలో కూడా అనుకుని ఉండడు. అనుకుంటే, కలలోనే ఆత్మ హత్య చేసుకునేవాడు. నేను కూడా ఎప్పుడూ అనుకోలేదు. అనుకుంటే- మా డ్రాయింగు మాస్టార్ని 'పూరీకూర' అని పిలిచేవాణ్ణి కాదు. లెక్కల మాస్టారి పేరు 'కాపేటాగారని', జాగ్రఫీ మాస్టారి పేరు 'దడదడ నాయుడు' గారని గోడలమీద రాసేవాణ్ణి కాదు.

పొరపాటు మానవసహజం. ఈ సంగతి నాకు పూర్తిగా తెలుసు. ఐతే- మా లెక్కల మేస్టారికి తెలియదనుకుంటాను. ఎప్పుడన్నా పొర పాటున మా అన్నయ్య నా హోంవర్కు పుస్తకంలో ఎనిమిది తొమ్మి దులు ఎనభైతొమ్మిది అని వేస్తే, స్కూలుకొచ్చిన తర్వాత నా నెత్తిమీద మూడ్రెళ్ళు ఎనిమిది వేసేవారు. అసలే తెలివైన వాణ్ణేమో నెత్తిమీద మొటితే బాగా నెప్పిగా ఉండేది. ఇలా ఉండగా ఆయనేఒకసారి పొర పాటు చేశారు. ఆయన చేసిన మొదటి పొరపాటు నా కొక కవరు ఇచ్చి పోస్టు చేయమనటం. ఆయన చేసిన రెండో పొరపాటు కవరుమీద 'కొత్తపేట - తూ. గో. జిల్లా' అని రాయటానికి బదులు 'కొపేట-

తూ.గో.జిల్లా' అని రాయటం. రైళ్ళకంటె, గుడిదగ్గరజోళ్ళకంటె, ఆడవాళ్ళ నోళ్ళకంటె - వేగంగా కదులుతాయి మేష్టర్ల మారుపేర్లు. ఆయనకు 'కొపేటా' పేరు స్థిరమై పోయింది. మర్నాటినుంచి ఆయన అమలాపురం నుంచి కొత్తపేట వెళ్ళవలసి వస్తే, ఆ బస్సు ఎక్కటానికి బదులు, ఎవరైనా చూస్తారేమోనని, కోటిపల్లి వెళ్ళి రాజమండ్రీ మీదుగా వెళ్ళేవారు.

మరో మేష్టారుండేవారు. ఆయనకి నేనంటే ప్రాణం. అందుకని, ఏ పని కావలిసి వచ్చినా, నా చేతే చేయించుకునేవారు. సిగరెట్లు కావలిస్తే నాచేతే తెప్పించుకునేవారు. సరిగా చదవటల్లేదని నన్నే తిట్టేవారు. ఒక రోజున రాత్రి పన్నెండుగంటల వరకు పరీక్షకు చదివి అలసిపోయాం. విశ్రాంతి కావలసి వచ్చింది. ఒకపని చేసి అలసిపోతే, మరోపని చేస్తే విశ్రాంతి కలుగుతుందని పట్టాభిగారిలా మాకూ విశ్వాసం. మా మేష్టారింటికి బయలుదేరాం. ఆయన బేంకు మేనేజరు గారింట్లో ఉండేవారు. బేంకు మేనేజర్ల సంగతి మీకు తెలుసుగా ? దేశంలో బేంకింగును అభివృద్ధి చేయటం కోసం చాకళ్ళకు మంగళ్ళకు కూడా డబ్బు లివ్వటానికి బదులు చెక్కులు రాసి ఇస్తూంటారు. ఇంట్లో ఒక రూపాయి చిల్లర అట్టే పెట్టుకొని, మిగతాది బేంకులో పడేస్తారు. రూపాయి చిల్లర ఇనప్పెట్టెలో పెట్టి, తాళం వేసి, తాళాలు బేంకులో పడేస్తారు. బేంకు మేనేజరు గారి తండ్రి 'ప్రాక్టికల్ వేదాంతి' గారుండేవారు. ఆయన ఇహంలో దొంగల్ని, పరంలో పాపాల్ని పారద్రోలడం కోసం, ఆమడ దూరం విన బడేటట్టు భగవద్గీత పారాయణ చేస్తూండేవారు. వాళ్లు రాత్రి పదిగంటల వరకూ బయటనే కూచొని - ప్రపంచాన్నంతనూ ధైర్యంగా విమర్శించి, పదిగంటలు కాగానే లోపలికి పోయి తలుపులేసుకొని కుర్చీలడ్డు పెట్టి పడుకున్నారు.

మేము విశ్రాంతికోసం మాస్టరు గారింటికి వెళ్ళి, 'దొంగలు, దొంగలు' అని అరిచాం. మా అరుపులు వినగానే ప్రాక్టికల్ వేదాంతి గారు ఒక్కదూకులో వచ్చి, ఎందుకైనా మంచిదని, కిటికీతలుపు కూడా గడియ పెట్టేశాడు. 'గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ....' అంటూ తిరిగి పారాయణ ప్రారంభించాడు. 'దొంగలు, దొంగలు' అన్నాం మేం. 'వస్తున్నా వస్తున్నా' అన్నారు మేనేజరుగారు, లోపల్నించే. 'మాస్టారూ! దొంగలు, దొంగలు' అన్నాం.' కర్రేది ? తన్నండి. పట్టండి. కొట్టండి' అని అరిచారు మాస్టారు లోపల్నించే_మాకు సాయంచేయాలనే ఉద్దేశ్యంతో. 'దొంగలు' అన్నాంమేం. మాస్టారుకూడా 'దొంగలు' అని అరిచారు. మాస్టారి పెళ్లాం కూడా 'దొంగలు' అని అరిచింది. తలుపుకి మేష్టారు మరో పడక్కుర్చీ అడ్డం పెట్టారు. అరుస్తూనే వెళ్ళి, అన్నంగరిటె, కూరపళ్లెం అడ్డం పెట్టింది మాష్టారి పెళ్ళాం కిటికీ తలుపుకి.

ఎదరుగా 'మరిడి' అని మామిడితోపులో గుడిసేసుకొని కాపుర ముంటోంది. 'ఏంటయ్యా ?' అంది అది బయటకు వచ్చి. 'దొంగలు, మరిడీ !' అన్నాను. అది దేవాంతకురాలు. అబద్ధమని తోస్తే, అమ్మ దగ్గరికి పోయి చెబుతుంది, ఆవిడ చీపురుకట్ట తీస్తుంది. 'దొంగలు మరిడీ !' అన్నాడు మా కిష్టిగాడు కూడా. 'మిడిగ్రుడ్లు ! కోర మీసలు !! వెడద మొగము !! పెద్దనోరు !! వ్రేలెడి పెదవుల్ !!!' అన్నాను నేను మరిడిని నమ్మించాలనే వ్యర్థప్రయత్నంచేస్తూ. ఆ పద్యం అప్పుడే చదివాం. మా కిష్టిగాడికి నవ్వాగలేదు. మరిడికి నవ్వు కనిపించకుండా హరికేన్‌లాంతరు అటూ యిటూ ఆడించాడు. 'ఇప్పుడేం దొంగోళ్లయ్యా ?' పోయి పడుకోండి ! అద్దరేతిరికానీ రారు. నేనల్లా పుంతకాడి కెల్లొస్తున్నా. నన్ను చూచి దొంగోడనుకునేరు' అంది మరిడి.

మాస్టరుగారు స్కూలుకి వారం రోజులు సెలవు పెట్టారు. ఆయన వచ్చేసరికి 'దడదడనాయుడు' పేరు గోడలమీద చెక్కడం, చెరపడం కూడా అయిపోయింది.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే – నేనే మాస్టరీ చేయవలసి వస్తుందని కలలో కాకిచేత కబురొచ్చినా, చిన్నప్పుడింత అల్లరి చేసే వాణ్ణే కాదు. కాని ఏంచేస్తాం ? విధి బలీయమని తెలుసు. తెలిసి, నోరుమూసుకొని వూరుకొంటాం.

నేను నాలుగు రోజులు మాత్రం మాస్టరీ చేశాను. మొదటి రోజునే ఏం జరిగిందో తెలుసా ? డ్యూటీలో ప్రవేశించగానే హెడ్మాష్టరు గారు నా వైపు జాలిగా చూశారు. నన్ను నాలుగో క్లాసుకి పంపిస్తూ, కణ్వమహర్షి శకుంతలను సాగనంపినట్టు పంపారు. నేను వెడుతుంటే నన్ను వెనక్కు పిలిచి – జస్ట్ ఏ మినిట్ ! నేను కుక్కల సంగతి కాదూ చెబుతూంట ? కుక్కల దగ్గర మొదలెట్టి అనుకోకుండానే మాస్టర్లలోకి దిగిపోయాను. మొదట కుక్కల సంగతి చెప్పనీండి ! తరవాత మాస్టర్ల సంగతి చెబుతాను.

మా యింటికి వెళ్లేదారిలో చాలా కుక్క లున్నాయి. అందులో ఏదీ నన్నింత వరకూ కరవ లేదు. ఏదీ నన్ను చూసి మొరగ లేదు కూడా. అవన్నీ సమయం కోసం వేచి చూస్తున్నాయని నా అనుమానం. ఉన్నట్టుండి, అవి పరధ్యానంగా ఉన్నప్పుడో, నేను పరధ్యానంగా ఉన్నప్పుడో. లేచి తటాలున కరిచేస్తాయని నా భయం. నగరా లన్నిటిలోనూ కుక్క లెలాగా రోడ్డు మధ్యనే పడుకొంటాయి. కాబట్టి, నేను రోడ్డువెంట అర్ధప్రదక్షిణాలు చేస్తూ నడ వాల్సి వస్తూంటుంది. మా యింటి పక్కనే ఒకాయన ఉన్నాడు. అందరూ ఒకలా ఉండరుగా ? ఆయనకు మొరిగే కుక్కలు కనిపిస్తే

ఎక్కడ కరుస్తాయో అని భయపడి, అవి మొరిగేదాకా అక్కడనుంచి కదిలేవాడు కాదు. ఆఫీసుకి వెడుతున్నాసరే, ఠపీమని ఆగి, ఆ కుక్క మీద ఓ రాయి విసిరాడు. దారిలో రాళ్ళు దొరకవేమో అని భయపడి, ఇంటిదగ్గరే నాలుగు రాళ్లు కోటుజేబులో వేసుకొని బయలుదేరేవాడు. కుక్క నెత్తిమీద రాయి విసిరిన మరుక్షణం, ఆ కుక్క (ఎ) మొరిగేదైతే మొరుగుతుంది. లేకుంటే (బి) కరిచేదయితే కరుస్తుంది. కుక్క మొరిగే దయితే తోక ముడుచుకుని పరుగెత్తుతుంది. కుక్క కరిచే దయితే ఈయన డిటో. ఆయనను ఎన్ని కుక్కలు కరిచాయంటే ఆయనలో కుక్కరక్తమే ఎక్కువుందని నా నమ్మకం. ఆయన వాగుతున్నంతసేపూ సరే ! కాసేపు మాట్లాడకుండా నిలబడితే తొందరగా సెలవు తీసుకొని పడుగెడతాను. థియరీ మాట దేముడెరుగు ! బ్రతికుంటే బలుసాకు ఏరుకొని తినొచ్చు.

ఈ కారణం వల్లనే ఎవరేనా కాసేపు నిశ్శబ్దంగా నిలబడి చూస్తే నాకు తగని భయం. నేను నాలుగో క్లాసులోకి వెళ్ళగానే క్లాసంతా నిశ్శబ్దంగా అయిపోయింది. అంతకుముందే హెడ్మాష్టగారు నా వైపు జాలిగా చూసి : 'చూడండి, రావుగారు ! కొత్త మాస్టర్ని చూసినప్పుడు పిల్లలు కొంచెం ఇదిగా వుంటారు. ఓపికపట్టాలి !' అన్నారు. నేను క్లాసులోకి వెళ్ళగానే కుర్రాళ్ళు నా వైపు నిశ్శబ్దంగా, లజ్జారహితంగా బహిరంగంగా తేరిపార చూస్తుంటే, నాకు అరికాలి ప్రాణం తోక్కొచ్చింది. 'ఏ క్లాసు ?' అన్నాను. 'నాలుగు' అన్నారు కొందరు. 'కాదు, జాగ్రఫీ' అన్నారు మరి కొందరు. 'ఎంతవరకు వచ్చారు ?' అన్నాను. 'ఇంకా రాలేదు' అన్నారు కొందరు. 'సరాసరి వరకు' అన్నారు మరి కొందరు. 'ఆపు అయిపోయింది సార్ ! కుక్క చెప్పాలి. మీరు చెబుతారా సార్ ?' అన్నాడు, రెండో బెంచీలో చివర్న కూచున్న ఓ

కుర్రాడు నాకు చాలా ఆశ్చర్యం వేసింది. మేం చదువుకునే రోజుల్లో జాగ్రఫీలో కుక్కల్ని గురించీ. ఆవుల్ని గురించీ చెప్పేవారు కాదు మరి!

కుక్క పాఠంలో ఏం చెబుతారు ? కుక్క విశ్వాసంకల జంతువనీ, దానికి రెండు కళ్లు, నాలుగు కాళ్లు అని, ఒక తలా తోకా అనీ, ఎటసెటరా. నేను లేచి సహజ నినద మేఘస్వనంలో గంభీరమైన ఉపన్యాసం చేశాను. యజమానుల పట్ల విశ్వాసంతో ప్రాణాలనే బలియిచ్చిన కుక్కలను గురించి. నే చెబుతుంటే నాకే కళ్ళమ్మట నీళ్లు కారాయి. కుక్కపిల్లలు చేసే చిలిపి పనులను వర్ణిస్తూ, పిల్లలందరితో బాటు నేనూ పకపకా నవ్వేను. పిల్లలందరూ ముగ్ధులై పోయారు నాటి నాఉపన్యాసానికి. పగలబడి నవ్వారు నా కథలకి. నవ్వనప్పుడు నోరుతెరుచుకు విన్నారు.

'అందరూ' అన్నాను : పొరపాటు ! 'ఇద్దరు తప్ప మిగిలిన వాళ్ళందరూ' అనాలి. నాకు మనస్సు కష్టమనిపించింది. అందులో రెండో బెంచీమీద కుర్రాణ్ణి పిలిచి, జాలిగా : 'అబ్బాయి ! నీకు చెముడా?' అన్నాను. ' లేదండి ' అన్నాడు. 'పాఠం అర్థం కాలేదా ?' అన్నాను. 'లేదండి' అన్నాడు. 'ఏముందోయ్ అందులో అర్థం కాకపోవటానికి? కుక్కకి నాలుగుకాళ్లు ...' అంటూ మొదలెట్టాను. 'నాకు తెలుసండి —— మాకో కుక్క వుంది' అన్నాడు. ' గుడ్. వెరీగుడ్ ' అన్నాను ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో. 'అది ఊరికే మొరుగుతుందండీ' అన్నాడు. 'ఆరోగ్యానికి మంచిది' అన్నాను. 'అది కరుస్తుంది కూడానండి' అన్నాడు. 'నాన్సెన్స్' అన్నాను. 'నన్ను కరిచింది సార్ మూడుసార్లు ! ఎడంకాలిమీద ఒకసారి, కుడికాలిమీద ఓసారి, ఎడంకాలిమీద మరోసారి !' అన్నాడు. ముందు పొరపాటున 'ఇంజక్షనులాగ' అన్నాను. తేరుకొని – 'స్టాండప్ ఆంది బెంచ్' అన్నాను.

రెండో కుర్రాడు 'సార్ ?' అన్నాడు. 'ఏంకావాలి ?' అన్నాను. తీక్షణంగా – గంభీరంగా – హడలు కొట్టేటట్టు. ఈ విప్లవాన్ని నేనిక సహించదలచుకోలేదు. అంతకు ముందు నాకు మొరిగే కుక్కల థియరీలో నమ్మకం లేకపోయినా, నా ఉపన్యాసాన్ని కళ్లారా వింటోంటే నాకే నమ్మకం కలిగింది. అతను నావేపు బిత్తరపోయి చూశాడు. నాకు జాలేసింది. 'ఏమిటోయ్ ?' అన్నాను మెత్తగా. 'మాయింట్లో ఓకుక్క ఉందండి' అన్నాడు. 'మొరుగుతుందా ?' అన్నా తీవ్రంగా. 'మొరగదండి' అన్నాడు. 'గుడ్. వెరీ గుడ్. దొంగలు భయపడతారు' అన్నాను. 'అది కాదు సార్ ! మా కుక్క కరవదు కూడానండి' అన్నాడు. 'ఏదయినా జబ్బేమో ! డాక్టరు దగ్గరకు తీసుకెళ్లు' అన్నాను. 'జబ్బేమీ లేదు సార్ ! మూడు పూట్లా తినేళ్లి మంచం కింద పడుకుంటుంది' అన్నాడు. నాకు వళ్లు మండుకొచ్చింది. 'ఒక రోజున తిండి పెట్టడం మానేయ్ ! అదే మొరుగుతుంది' అన్నాను విసురుగా. 'మానేశాను సార్ !' అన్నాడు. 'ఏం జరిగింది ?' అన్నాను చిరాగ్గా, వాడు నావేపు తీరుగా చూసి 'అదే వంటింట్లోకి పోయి – తినేసి పడుకొంది' అన్నాడు. 'స్టాండప్ ఆన్ది బెంచ్' అన్నాను. వాడు బెంచీ ఎక్కుతూనే – 'అప్పుడు కూడా మొరగలేదు సార్' అన్నాడు.

నేను క్లాసు విడిచి వెళ్లేసరికి మా హెడ్మాష్టరుగారు బయటే నిలబడి ఉన్నారు. "అంతా విన్నాను" అన్నారు. "వాడు మావాడే" అన్నారు. "ఎవరు ?" అన్నాను. హెడ్మాష్టరుగారు తలవంచుకుని, "మొరగని కరవని కుక్క సంగతి చెప్పాడే ? వాడు" అన్నారు. నేనాయన వైపు గుడ్లురిమి చూశాను. ఎంత హెడ్మాష్టరయితే మటుక్కు ?... నాచూపు చూసి ఆయన భయపడ్డారు. వెంటనే "అంతా తల్లి పోలిక" అన్నారు. నాకాయన్ని చూస్తే జాలేసింది.

అప్పట్నించి ఇప్పటివరకు నాకాయనంటే జాలే! నాలుగురోజులు పూర్తికాక ముందే నేను మాస్టరీ మానేశాను. ఆయన హెడ్మాష్టరీ వదల లేదు. మాష్టర్లు ఎప్పుడూ వాగుతుంటారనీ, కుర్రాళ్లు ఎప్పుడూ కరవ టానికి సిద్ధంగా ఉంటారని మనవి చేశాను. మాస్టర్లనుచూసి జాలిపడితే— హెడ్మాష్టరును చూసి ఇంకా జాలిపడాలి!

మొరిగేవాళ్లు కరవ లేరన్న సంగతి విడిచిపెట్టి, ఎక్కువ వాగే వాళ్లు తక్కువ కరుస్తారని, తక్కువ వాగేవాళ్లు ఎక్కువ కరుస్తారని అంటే అందరూ ఒప్పుకుంటారు. మన మంత్రులే మనకి ప్రత్యక్ష నిదర్శనం. వాళ్లు వాగిన విషయాలలో సత్వరం కరిచిన ఉదాహరణలు బహుకొద్ది. మరి – నిజంగా కరిచిన సమస్యలను గురించి ఎందుకో "మొరగనే మొరగరు."

ఏది ఏమయినా — మొరిగేవి ఏవయినా కరవ నేరవని నా ధృఢ విశ్వాసం. ఇది స్థానికమయిన విషయం కాదు. తెలుగువారి కొక్కరికీ సంబంధించినదీ కాదు. అంతర్జాతీయ ధర్మసూత్రాలలో ఇది ఒక్కటి. పండిట్ నెహ్రూ మొన్న నెక్కడో మాట్లాడుతూ – "మొరిగే కుక్కలు కరవ నేరవని ప్రచారం జరుగుతోంది. నాకు విశ్వాసం లేదు." అన్నా డట. పండిట్జీ వంటి పరిశోధనావాది అంతమాట అన్నాడంటే నేను నమ్మను. కాకపోయినా, విషయాన్ని సాకల్యంగా పరిశీలిస్తే ఆయన అభిప్రాయం మార్చుకొంటాడు.

జస్టేమినిట్: నా అభిప్రాయం ఎల్లా మారిందీ చెబుతామను కున్నాను. ఆ విషయమే మరిచిపోయాను పూర్తిగా. నాకు మొరగటం ఆరంభిస్తే ఎక్కడ ఆపాలో తెలియదు. ఈ మాటెప్పుడైనా చెబుతాను.

[ 1957 ]

# తెగిపోయిన గాలిపటం

## 5

[ ఇది ఒక నాటిక అని పాఠకు లంగీకరిస్తే, ఇది ఒక శ్రవ్యనాటికగా భావించుకొని రచయిత మనసును తృప్తిపరచుకుంటాడు. దీనికి 'తెగిపోయిన గాలిపటం' అని పేరు పెట్టడానికి మూడు బల వత్తరమైన కారణాలున్నాయ్. అందులో మొదటిది, మరే పేరు పెట్టాలో రచయితకి తెలియక పోవడం. గాలిపటం ఊహకి చిహ్నం. తెగిపోయిన గాలిపటం అదుపులో లేని ఊహాశక్తికి చిహ్నం. ఇదో కారణం ఈ పేరుకి. ఈ నాటిక తీరా ఎలా అంతం చేయాలో తెలియ లేదు రచయితకి. అదో కారణం. ఇక చదవండి; లేదా, చదవాలో లేదో నిశ్చయం చేసుకోండి. థేంక్స్యూ ... ]

లలిత : చూడండీ, .... .... ఆవిడ పొద్దున్నే వచ్చి వెళ్ళింది.

మూర్తి : వచ్చి-వెళ్ళింది కదా ? మరేం ఫరవాలేదు...ఏవిడంటావ్ ?

లలిత : ఇంటావిడఅండీ ! అనసూయమ్మగారు, ' మీ ఆయన ఏమన్నా డమ్మా ? ' అని అడిగింది.

మూర్తి : ' ఏమీ అనలేదు ' అని చెప్పవలసింది. నేనెప్పుడన్నా, ఎవరి నన్నా, ఏదన్నా అన్నానుటే ?

లలిత : ఐతే – పిల్లాడికి ట్యూషన్ చెబుతారా ?

మూర్తి : పిల్లాడికా ? ఏ పిల్లాడికి ? ట్యూషనేమిటి ? చంపేశావ్ ! నాకు పిల్లలంటే అసలే భయం. పూర్వ జన్మలో ఏం పాపం చేసుకున్నామోగాని అప్పుడే ముగ్గురు పిల్లలు : నంబర్ వన్, టూ, త్రీ అంటూ. ఇంకా ఎంతమంది రానున్నారో తెలియదు...

లలిత : మన పిల్లలంటే మీకింత అసహ్యమని తెలియదులెండి...

మూర్తి : మన పిల్లలంటేకాదు. నన్ను సరిగా అర్థం చేసుకో. పిల్లలెవరన్నా నాకు అసహ్యమే...అసహ్యం కూడా కాదు. భయం ! నేనొకసారి బి. ఏ. చదువుతున్నప్పుడు ఫుట్‌బాల్ ఆడేను. నాతో ఆడుతున్న వాళ్ళంతా ఫస్టుఫారమ్ పిల్లలు. ' అధమం వీళ్ళతో ఆడైనా గెలవలేమా ? ' అని నా ధీమా. ఫుట్‌బాల్ పరుగెత్తుకుంటూ నా దగ్గరకొచ్చింది. ఫెడేల్‌మని తన్నేవాణ్నే ! కాలుకూడా ఎత్తాను. ఇంతలో ఓ కుర్రవెధవ తటాలున వచ్చి ' సేమ్ పార్టీ ' అన్నాడు. ' సేమ్ పార్టీగదా ? తన్నడం ఏ౽మర్యాద ? '– అని పక్కకు తప్పుకున్నాను. వాడు బంతి తన్నుకు పోయాడు. వెంటనే పదకొండుగురు కుర్రాళ్ళు కిలకిలా నవ్వేరు; పదిమంది చురచురా చూశారు. నాకేం తెలుసు ? ఆ తన్నినవాడు అవతలి పార్టీవాట్ట. ' బాల

వాక్యం బ్రహ్మ వాక్యం ' కదా ? కుర్రాళ్ళు అబద్ధమాడతారా అనుకున్నాను. అదీ సంగతి ... ఇంతకీ ఎవడికిట పాఠం చెప్పడం ?

లలిత : ఆ కుష్టుడికి ....

మూర్తి : హాఁ !

లలిత : ఎందుకొచ్చిన ఎమ్మె ఎలెర్ఫీలండీ ? ఆ నాగభూషణం గారి నడిగితే ఎడవదా చెబుతాడు.

మూర్తి : ఆయనకి పదిహేనున్నరమంది పిల్లలు. ఆయన కయిన బైర్రియి నింగు నాకేదీ ? ... అందులో ఆ కుష్టుడికా ? వాడు నా ప్రాణాలు తోడేస్తాడు. మొదట్లో నేను ధైర్యంగానే ప్రారంభిస్తా . . .

[ ఒకటో అరో పియానో ధ్వనులు ]

మూర్తి : (గంభీరంగా) ఆఁ ఏమిటోయ్ కుష్టుడు ! కిష్టప్ప, కిష్టారావ్ ! ఏవిఁటి సంగతి ? మనం ఎంత వరకు వచ్చాం నిన్న ?

కుష్టుడు : (నీరసంగా) సార్ ?

మూర్తి : ' నిన్న ఎంతవరకు వచ్చాం ? ' అని అడుగుతున్నాను . . . ఏవిఁటి – ఎప్పుడూ నువ్వు నీరసంగా మాటాడతావేం ? మూడు పూట్లా అన్నం తినవా ?

కుష్టుడు : తింటానండి.

మూర్తి : మరేవిఁటి తెగులు ? – ఎప్పుడు టి. బీ. పేషెంటులా మాటాడతావ్ ?–నిన్న బారువడ్డీ చేస్తున్నాం కదూ ? ఇప్పుడు

చెప్పు : (కంఠం హెచ్చించి) ఒకడు . . . నూటికి, ఆరు పెర్సెంటు వడ్డీ చొప్పునా, ఐదువేల ఆరువందల డెబ్భై ఐదు రూపాయలు అప్పు తీసుకొని, మూడు సంవత్సరముల తొమ్మిది మాసముల తర్వాత రూపాయి అణాపైసలతో తీర్చి వేశాడు. వాడు మొత్తం ఎంత తీర్చాడు ? .... నోటితో చెప్పాలి . . . మాట్లాడవేం ? . . . 5675 ని $\frac{106}{100} \times \frac{15}{4}$ పెట్టి హెచ్చవేస్తే ఏంతొస్తుంది ?

కుష్టుడు : నాకు ఎక్కాలు రావు సార్ !

మూర్తి : రావూ ? ఎక్కాల్ రావూ ? ఎక్కాల్ రాకపోతే లెఖ్ఖల్ రావు. లెఖ్ఖల్ రాకపోతే, నువ్వు పరీక్ష పేసుకావడం ఇంపాజిబుల్. తెలుసా ? పరీక్ష పేస్ కాకపోతే . . .

కుష్టుడు : సార్ ? . . . మీకు ఎక్కాలు లెఖ్ఖలు భా...గా వచ్చా, సార్ ?

మూర్తి : 'బాగా వచ్చా ?' అని అడుగుతున్నావూ ? చిలకమర్తి వారి గణపతీ, నేనూ కేవలం క్లాస్‌మేట్సు అనుకో. ఎక్కాలు రాకపోతే మాగురువుగారు జుట్టు పట్టుకు దూలానికి ముడేసే వారు. ఇరవై ఒకటి ఇరవై ఒకట్లు ఎంతనడుగు ఠపీమని చెబుతాను : 441 అని. 26, 26 లు ఎంతను ? వెంటనే చెబుతా : ఆరువందల . . . ఆరువందల డెబ్భై . . . ఆరు వందల డెబ్భై ఆరని . . . ఊఁ . . . అర్థమైందా ? లెఖ్ఖలు బాగా రావాలంటే, ఎక్కాలు బాగా రావాలి.

కుష్టుడు : ఇరవై తొమ్మిది ఇరవై తొమ్మిదు లెంత సార్ ?

మూర్తి : ఊఁ... ఎక్కాలు రాకపోతే లెఖ్ఖల్ రావ్. లెఖ్ఖలే రాకపోతే—

కుష్టుడు : ఇరవై తొమ్మిది ఇరవై తొమ్మిదులు ...

మూర్తి : గుడ్, వెరీ గుడ్ ... చాలా బాపుంది ... నిన్న హిస్టరీలో ఎంతవరకూ వచ్చాం ? ... అనార్కలీకి సలీమ్‌కు గల అమరప్రేమ చక్రవర్తికి ఇష్టంలేక పోయింది. వెంటనే చక్రవర్తి ఏం చేశాడు ? ఇటు పక్క కుమారుడు. సకల సామ్రాజ్యానికి కాబోయే చక్రవర్తి. ప్రజల భవిష్యత్తు అంతా చక్రివర్తిపై ఆధారపడి ఉంటుంది. అటు, అనార్కలీ చూస్తే చాలా అందంగా ఉంటుంది.

కుష్టుడు : అనార్కలీ చా ... లా అందంగా ఉంటుందా సార్ ?

మూర్తి : చాలా అందంగా అని అడుగుతున్నావా ? జగదేక సుందరి. మల్లెపువ్వులోని సౌకుమార్యాన్ని, గులాబీ పువ్వులోని ... గులాబీపువ్వులోని .... సౌకుమార్యాన్నికలిగి ఉంటుంది.

కుష్టుడు : మిస్ గేబ్రియల్ కంటె బాపుంటుందా సార్ ?

మూర్తి : (ఖంగారుగా) మిస్ గేబ్రియల్ ఎవరు ?

కుష్టుడు : మీ ఆఫీసులో టైపిస్టండీ ...

మూర్తి : చూడు. కిష్టుడూ, నువ్వు చాలా దోషపూరితమైన వాక్కు లుచ్చరిస్తున్నావ్. మిస్ గేబ్రియల్ ఎంత మహాపతివ్రతో తెలుసా ? ఒకసారి ఆమె భర్తకు జబ్బు చేస్తే, అన్నపానా దులకు లెఖ్ఖచేయక, రాత్రిం బవళ్ళు కంటికి మంటికి ఏక ధారగా సేవచేసి, సావిత్రి సత్యవంతుణ్ణి గెల్చుకున్నట్లు, గెల్చుకుంది.

కుష్టుడు : 'మిస్' గేబ్రియల్‌కి భర్త ఎలా ఉంటాడు, సార్ ?

మూర్తి : నీ కక్ఖర్లేని విషయాలు లేవు, వెధవా అని. వెధవ్వేషాలూ నువ్వూను. ఎందుకురా నీకా సంగతులన్నీ ?

కిష్టుడు : అది కాదు, మా మామయ్య చెప్పాడు సార్ : మీరూ మిస్ గేబ్రియలూ చాలా ఫ్రెండ్సుట. కలిసి సినీమాలకు కూడా వెడుతూంటారట, ఆవిడ చాలా అందంగా ఉంటుందిట. 'అనార్కలీ' లా ఉంటుంది అన్నాడు. 'ఆవిడకి దొరకక్క-దొరకక్క ఈ కోతి మొహం దొరికాడేమిటి ?' అన్నాడు.

మూర్తి : ఆఁ ఏమన్నాడు ? మీ మామయ్యది మహామంచి మొహం కాబోలు . . .

లలిత : (ప్రవేశించి) ఏఁవిటోయ్, కిష్టుడూ, అంటున్నావ్ ?

మూర్తి : (తొందరగా) ఆఁ ఏం లేదు. పన్నెండు పన్నెండ్లెంతన్నాను. నూటనలభై రెండన్నాడు. అహ్హహ్హ.

లలిత : అంతేనా ? ఏదో సినీమా అన్నట్టుగా వినబడితేనూ ?

కిష్టుడు : కైటే, పిన్నీ. కైటే. బాబాయిగారి ఆఫీసులో మిస్ గేబ్రియల్ అని టైపిస్టు ఉంది. చాలా అందంగా ఉంటుందిట. మరేం...

మూర్తి : అది కాదే, అంతా అబద్ధం....

కిష్టుడు : మరి – బాబాయిగారు ఆవిడా కలిసి, సినీమాలకి కూడా వెడుతూంటారట....

లలిత : అయ్యో ! అయిందీ ? నేను అనుకుంటూనే ఉన్నాను. (ఏడుస్తూ) ప్రతిరోజూ ఆలస్యంగా ఆఫీసులో పనేమిట్రా అనుకున్నాను. ఇంక నలుగురిలో నేను ఎలా తలెత్తుకు తిరిగేది ? హయ్యో ?...

మూర్తి : చూడు, లలితా ! విను ! ఇటు చూడు. చూడమంటే మరి ? విను... ... ఎస్ గేబ్రియల్ మహా పతివ్రత . . .

లలిత : హయ్యో ! పెళ్ళి కానిదానికి పాతివ్రత్యం ఏమిటండీ ? (నిశ్చయంగా) నన్ను పుట్టింటిలో విడిచిపెట్టేసెయ్యండి. ఇక్కడ ఈ విధంగా అవమానించబడ్డంకంటె, పుట్టింటిలోపడి చాకిరీ చెయ్యడం మేలు . . . హా ! హతవిధీ ! . . .

కుష్టుడు : (సినీమాలో విలన్‌లా వికటాట్టహాసం చేస్తాడు).

మూర్తి : చాల్లేవోయ్. సంతోషించాం. బంగారం వంటి నిప్పుల్లో సంసారం వొలకపోశావ్. (కుష్టుడు మళ్ళీ అల్లాగే నవ్వుతాడు.) చూడు, లలితా ! నే నే పాపం ఎరగను. వచ్చేది సంక్రాంతి కదా అని, నీకో కొత్తచీర కొనివ్వాలని . . .

లలిత : కొత్తచీరే ? నిజంగానా ? (హాయిగా నవ్వుతుంది) అహో ! మీ రెంత మంచివారు ? ఈ దుష్టుడు కుష్టుడు మాటలు విని నే నెంత మోసపోయాను !

మూర్తి : లలితా ! నేను నిన్ను మోసం చేస్తానా ? నేను ! నిన్ను ! ! మోసం ? అహఁ నమ్మవలసిందే !

[ఒకటో, ఒకటిన్నరో పియానో ధ్వనులు]

లలిత : ఏమండోయ్ ? ...ఏమండొహోయ్ ? ...ఏమండిహీ ?.... పట్టపగలే ఇంత పరధ్యానమైతే ఎలా చెప్పండి.

మూర్తి : పరధ్యానమా ? పరధ్యానమ్ ? ఔను. పరధ్యానం. అది సరే కాని, లలితా, కిష్టుడికి ట్యూషన్ చెప్పనంటే నీకు కోపం వస్తుందా ?

లలిత : మధ్యన నాకు కోపం దేనికండీ ?

మూర్తి : వెధవ. పనికిమాలిన ప్రశ్నలన్నీ వేస్తూంటాడు వాడు.

లలిత : ట్యూషన్ చెబితే కిరాయి తగ్గిస్తుందింటావిడ, అందుకు చెప్పాను. పోనీ, చెప్పకపోతే మానేరుగాని, ఆ రెండో విషయం ఏం చేశారు ?

మూర్తి : ఏ రెండో విషయం ?

లలిత : ఇంత మతిమరుపైతే ఎలాగండీ ? . . . వెనకాల నారాయణ రావుగారు గోడకి తూము పెట్టించారు. వాళ్ళ నీళ్ళన్నీ మన దొడ్లోకి వస్తున్నాయ్ . . . ఆ పక్క గోడ పగల గొట్టించి నందుకు కృష్ణమూర్తిగారితో రాద్ధాంతం వొతోంది. గరాజ్‌లో ఉన్న బెయిలరవ్వ . . . . .

మూర్తి : ....గరాజ్‌లో ఉండకుండా పిల్లా జెల్లాతో ఇంట్లోనే కాపరం పెట్టింది. అంతేనా ?

లలిత : ఆవిడ మీరు ఆసరా ఉంటారని, వాళ్ళందరితో వ్యాజ్యాలకు దిగిందట. మీరు కోర్టులో సాక్ష్యం చెప్పాలిట !

మూర్తి : అమ్మ బాబోయ్ ! సాక్ష్యమే ? కోర్టులో ! నా వల్లకాదు.

లలిత : అదేమిటండీ 'లా' పేసయి కూడా కోర్టులంటే అంతభయం? మా నాన్న రోజూ వెడతాడు కోర్టుకి.

మూర్తి : నువ్వు కూడా లా పేసయితే తెలిసేది కోర్టు లెంత భయం కరంగా ఉంటాయో? మీ నాన్న వెడతాడు. వెళ్ళకేం? అయన ప్లీడరు. కోర్టుల్లో అసలు కొంపలు కూల్చేది ప్లీడర్లే. చొప్ప దంటు ప్రశ్న లేసి, అబద్ధా లాడించేసి, శపీమని పీకట్టు కుంటారు. నీకేం తెలుసు – కోర్టుల సంగతి ?

[ఆలయంగంటలు ఒకదాని వెనుక ఒకటి మ్రోగిన చప్పుడు]

ఒక కంఠం: సాయ్‌లెన్సు !

ప్రతిపక్షం ప్లీడరు : (క్రూరంగా, భయంకరంగా) నీ పేరు ?

మూర్తి : అమలాపురపు సూర్యనారాయణ మూర్తి.

ప్ర.ప.ప్లీ. : తండ్రి పేరు ? వయస్సు ? ఊరు ? ఉద్యోగం ? పిల్లలు ? పెళ్ళయిందా ?

మూర్తి : (త్వరత్వరగా) అమలాపురం. అయింది. ఇరవైఏడు. లేదు. ఉన్నారు ముగ్గురు. సుబ్బారావు.

ప్ర.ప.ప్లీ. : యువరానర్ ! గమనించండి, సాక్షి చెప్పే అబద్ధాలు: తండ్రి పేరు అమలాపురం. వయస్సు అయింది. ఊరు ఇరవై ఏడు. ఉద్యోగం లేదు. పిల్లలు ఉన్నారు ముగ్గురు. 'పెళ్ళయిందా ?' అంటే 'సుబ్బారావు' అంటాడు.

మూర్తి : నా అభిప్రాయం అది కాదు, సార్ !

ప్ర.ప.ప్లీ. : నీ అభిప్రాయాలతో మాకు నిమిత్తం లేదు. మాకు సత్యం కావాలి. సత్యం అనే పునాదిరాయి పైన కోర్టు లనే సౌధాలు నిలబడి ఉన్నాయి. నీకు పెళ్ళై ఉండాలి; లేకపోతే - కాకపోయుండాలి. దీనితో నీ అభిప్రాయాలకు ఏమైనా సంబంధం ఉందా ?

మూర్తి : (నీరసంగా) అది కాదు, సార్ !

ప్ర.ప.ప్లీ. : 'అదికాదు' కాదు. 'అవును. కాదు', 'ఉంది, లేదు', ఏదో ఒకటి చెప్పాలి. ఉందా, లేదా ?

మూర్తి : ఉంది సార్ !

ప్ర.ప.ప్లీ. : (గంభీరంగా) ఉందా ?

మూర్తి : (తొందరగా) లేదు, సార్ !

ప్ర.ప.ప్లీ. : యువరానర్ ! ఈ సాక్షి చెప్పే అబద్ధాలకు అంతులేదు. ఒకే ఒక నిమిషంలో ఎన్ని పరస్పర విరుద్ధమైన అబద్ధా లాడేడో కోర్టువారు గమనించాలి...మిస్టర్ మూర్తి ! ఇప్పుడు అడగ బోయే ప్రశ్నలకు నువ్వు సమాధానం ఈ నక్కర్లేదు.

మూర్తి : అఖర్లేదా, సార్ ? నే వెళ్ళిపోవచ్చా, సార్ ?

ప్ర.ప.ప్లీ. : ష్ ! నువ్విచ్చే సమాధానాలు (గంభీరంగా) నీకు వ్యతిరేకంగా ఉపయోగింపబడవచ్చునని గమనించు .. నారాయణ రావుగారి గోడలోని తూములో నుంచి మురికినీరు వచ్చి, వాది ఇల్లు సర్వనాశనం ఐపోతూందని వాది వాదిస్తూంది. దానికి నువ్వేమంటావ్ ?

మూర్తి : వాదిని వాదించవద్దని నేను అనేకసార్లు చెప్పాను, సార్ ! ఐనా – వాదన వాదికి అలవాటైపోయిందండి.

ప్ర.ప.ప్లీ. : వాది వాదన తప్పంటావు నువ్వు. అంతేనా ?

మూర్తి : 'తప్పు' అంటే దాన్ని తిరిగి నాకు వ్యతిరేకంగా ఉపయోగించ వచ్చునాండి ?

ప్ర.ప.ప్లీ. : ఓ ! నిస్సందేహంగా !

మూర్తి : అయితే అననండి.

ప్ర.ప.ప్లీ. : నారాయణరావుగారి నెరుగుదువా ? ఆయన ఇల్లెరుగుదువా ?

మూర్తి : ఆయన ఇంటికేమండి ? రాజాభవంతిలా ఉంటుందండి.

ప్ర.ప.ప్లీ. : తూముని చూశావా ? తూములోని నీళ్ళని చూశావా ?

మూర్తి : తూముని చూడకేమండీ ? మా ఇంటినిండా తూములేనండి.

ప్ర.ప.ప్లీ. : నీళ్లు ?

మూర్తి : మా ఆవిడ ఎప్పుడూ కంటినిండా నీళ్ళు పెట్టుకుంటూనే ఉంటుందండి.

ప్ర.ప.ప్లీ. : (గర్జిస్తూ) తూములో నీళ్ళసంగతి నేను చెప్పేది.

మూర్తి : తూములోంచి నీళ్ళు పోవని మా ఆవిడ ఎప్పుడూ గోల పెడుతుందండి.

ప్ర.ప.ప్లీ. : మిస్టర్ మూర్తి ! నాకు సూటిగా సమాధానం చెప్పండి, నారాయణరావు గారి గోడలోని తూములోంచి వచ్చే నీళ్ళు మీ ఇంట్లోకి వస్తున్నాయా, లేదా ?

మూర్తి : "మా ఇంట్లోకి" అంటే మా ఇంట్లోకి కాదనుకోండి. "వస్తున్నాయా ?" అంటే వర్తమానకాలంలో ఖచ్చితంగా చెప్పడం కష్టమండి.

ప్ర.ప.ప్లీ. : (భయంకరంగా) నీళ్ళు వస్తున్నాయా? లేదా ?

మూర్తి : వస్తున్నాయ్.

ప్ర.ప.ప్లీ. : (గర్జిస్తూ) వస్తున్నాయా ?

మూర్తి : లేదండి. ఒక్క బొట్టు కూడా రావడంలేదు. అసలు తూములోంచి నీళ్ళు రావట మేమిటండీ ? ఎవరన్నా నవ్విపోతారు.

ప్ర.ప.ప్లీ. : యువరానర్ ! సాక్షి ఎన్ని అబద్ధాలాడుతున్నాడో చూడండి! "వస్తున్నాయ్ నీళ్ళు" అంటాడు. అదే కంఠంతో "లేదు" అంటాడు. మీరు మొదటిమాట నమ్మితే, రెండోది అబద్ధం. రెండోది నమ్మితే, మొదటిది అబద్ధం. ఈసాక్షిని ఎ-18-508 సెక్షన్ క్రింద. కంఠానికి త్రాడుకట్టి చెట్టు చిటారుకొమ్మకి చచ్చేదాకా వేలాడదీయడం సమంజసమని కోర్టువారికి సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

మూర్తి : (వణకుతూన్న కంఠంతో) ఆఁ ? ఆఁ ? ఎంత ఘోరం ? ఎంత ఘోరం ?

జడ్జి : సాక్షి !

మూర్తి : (వెంటనే–దీనంగా) ప్రభూ !

జడ్జి : నువ్వు చేసిన ఈ ఘోరమయిన నేరానికి ఉరిశిక్ష ...

మూర్తి : క్షమించాలి, ప్రభూ, క్షమించాలి. పిల్లలు కలవాణ్ణి.

ప్ర.ప.ప్లీ. : నిశ్శబ్దంగా ఉండి, కోర్టువారు చెప్పేదేమిటో విను.

మూర్తి : ఒకప్రక్క చచ్చిపోతూంటే ఇంకా నిశ్శబ్దమేమిటి ?

జడ్జి : (Expressionless voice తో)... ఈ ఘోరమయిన నేరానికి ఉరిశిక్ష తగినదని మేము భావించటం లేదు ....

మూర్తి : థేంక్యూ, యువరానర్ ! థేంక్యూ వెరీ మచ్ !

జడ్జి : అందువలన నీకు యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించడమైనది...

మూర్తి : ఆఁ ? ఆఁ ! యావజ్జీవమే ?

[హఠాత్తుగా లలిత నవ్వు వినబడుతుంది, లలిత నవ్వు తెరలు తెరలుగా వచ్చి ఆగిపోయిన తర్వాత...]

లలిత : ఏవిఁటండీ మీరు మరీను ? సాక్ష్యం చెప్పినవాళ్ళందరూ ఏదో అబద్ధమాడుతూనే ఉంటారు. దానికి యావజ్జీవ కారాగారవాస శిక్షా, ఉరిశిక్షా విధిస్తారేమిటి ఎక్కడన్నా ?

మూర్తి : నీకు తెలియదు, లలితా ! ....ఏది ఎలా ఉన్నా, నాకుమాత్రం ఇష్టంలేదు కోర్టు కెళ్ళి సాక్ష్యం ఇవ్వటం.

లలిత : ఆ సంగతే ఆవిడకి చెప్పండి.

మూర్తి ; నువ్వు వెళ్ళి చెప్పిరా !

లలిత : దేపరవారే వెళ్ళి చెప్పిరావచ్చు.

మూర్తి : అమ్మ బాబోయ్ ! అనసూయమ్మగారితో మాట్లాడటమే ! అందులో ఆవిడ చెప్పింది కాదనటం !

లలిత ; నేను మాట్లాడనుటండీ ఆవిడతో – రోజూ ?

మూర్తి : నీ సంగతి వేరు ! ఆవిడ ఈ ఇంటావిడ అని తెలిస్తే – నేనీ ఇంట్లో చేరేవాణ్ణే కాదు........ఆవిడ మొగుడు చిన్నప్పుడే ఎందుకు పోయాడో తెలుసా ?...ఆవిడ మొగుడు కాబట్టి.

లలిత : బాగానే ఉంది ! ... మీ రింత పిరికివారని తెలుస్తే – అసలు పెళ్లే చేసుకునేదాన్ని కాదు. ఎమ్మే పేసయ్యారు గదా ? ప్రపంచాన్నే జయించగల సమర్థులనుకున్నాను.

మూర్తి : ఇదిగో ! . . . లలితా ! . . . ఒక్కమాట ! . . . విను ! . . . వెళ్ళిపోయింది.

మూర్తి పరమాత్మ : (తెలుగు సినీమాలోలాగ) అవును. వెళ్ళిపోకేం చేస్తుంది ? . . . . నీ పిరికితనం చూసి, అసహ్యం వేసుం టుంది. ఆలోచించుకో ! నువ్వే ఆలోచించుకో !

మూర్తి జీవాత్మ : (తె. సి. లో లాగే– నెమ్మదిగా, నీరసంగా) నీకేం తెలుసు, పరమాత్మా, అనసూయమ్మగారి సంగతి ? ఆవిణ్ణి చూస్తే నువ్విలా అనవు. ఆవిణ్ణి పెళ్లిచేసుకున్న కొంత

కాలానికే ఆవిడ మొగుడు ఆత్మహత్యకూడా అవసరంలేకుండా చచ్చిపోయాడు.

మూ. ప. : (గంభీరంగా) నాకు తెలియని దొకటుందని భావిస్తున్నావా, జీవాత్మా ? పిచ్చాడా ! నేను లక్షమంది అనసూయమ్మలను చూశాను నా సర్వీసులో. లలిత మొహం చూడు. ఆమె కను రెప్పల బరువు చూడు. నిన్ను చూసి ఆమె ఎంత సిగ్గుపడు తుందో గమనించు.

మూ.జీ. : నాకేం అర్థంకావడంలేదు. . . నాకేం అర్థంకావడంలేదు . . . ఆమె వద్దకు వెళ్ళడమా ? మానడమా ? టు బీ, ఆర్ నాట్ టు బీ ? ద టీజ్ ది క్వశ్చన్ !

మూ.ప. : నువ్వు వెళ్ళకపోతే ఆవిడే నీ దగ్గరకొస్తుంది.

మూర్తి : రానీండి ! నా కేం భయంలేదు. భార్యచే పిరికివాడుగా భావింప బడుటకంటె – అన్ని విధంబుల మరణించుట మేలు. పది మంది ఇంటావిళ్లు వచ్చినా నాకేం భయంలేదు.

పదిమంది ఇంటావిళ్లు : [ పాటగా పాడుతూ ]

రానీం డన్నావుగా ? ఇదిగో వచ్చాం ! పదిమందొచ్చాం !
ఈ నెల కిరాయి, కిందటినెల బకాయి,
ఇస్తావా ? చస్తావా ?

ఒక కంఠం :—

పడకగది గోడకున్న పొగచూరు
హాలుకెళ్లే గుమ్మంపై తారు
ఎవరు వేశారు ?
ఎందుకు వేశారు ?

ప. ఇంటావిళ్ళు :—

ఇస్తావా ? చస్తావా ?
ఈ నెల కిరాయి – కిందటినెల బకాయి
ఆ కిందటినెల బకాయి – ఆ కిందటినెల బకాయి . . .

మూర్తి : [కోపంగా]

ఎవరమ్మా మీరు ? ఎవరు మీరు ?

మీ రెవరు ? ఎందుకొచ్చారు ?

పదిమంది ఇంటావిళ్లు :—

చెప్పాంగా ? పదిమందింటావిళ్లం !
రమ్మనమంటే వచ్చాం !
కిరాయికోసం వచ్చాం !
కిరాయికోసం !
ఈ నెల కిరాయికోసం : వెనకటినెల బకాయికోసం !

మూర్తి : [విసురుగా]

తూములోని నీళ్లు : కడుగుతున్నాయ్ కాళ్లు !

[ఫిర్యాదు చేస్తూ ]

పూడ్పించడానికి కావాలి సొమ్ము –
అంతవరకు మీ కిరాయి యత్నం వమ్ము !
పూడ్పించడానికి కావాలి అర్థమ్,
అంతవరకు మీ కిరాయి యత్నం వ్యర్థమ్ !

పదిమంది ఇంటావిళ్లు :— [విచారంగా]

ఐతే – మా కిరాయి ఇవ్వవా ?

బకాయి ఇవ్వవా ?

మూర్తి :—

పిల్లాడి నెత్తిమీద పడింది గోడమీది బెల్లు –
చెల్లించాలి డాక్టరుకి పెనుఘాతం బిల్లు !
చెల్లించలేదు మీరు ఎలక్ట్రి బిల్లు !
అంతవరకు మీకు కిరాయి "నిల్లు".

పదిమంది ఇంటావిళ్లు : [ఓడిపోయిన కంఠాలతో]

అయ్యో – ఇవ్వవా ? కిరాయే – ఇవ్వవా ?
ఇవ్వనే – ఇవ్వవా ? బకాయే – ఇవ్వవా ?

మూర్తి :—

ఎలాగైతే ఇస్తున్నారు – మూడుపదులకు రెండుగదులు !
ఎక్కడైనా ఇస్తున్నార్ – రెండు పదులకు మూడుగదులు !!

పదిమంది ఇంటావిళ్లు : [బ్రతిమాలుకుంటూ]

పోనీ సాక్ష్యం చెప్పవా ?
కుర్రాడికి ట్యూషన్ చెప్పవా ?

మూర్తి : [అంత అర్థంలేని సూచన చేసినందుకు]

నేనా ? సాక్ష్యమా ? చెప్పటమా ? హహ్హహ్హ !
కుర్రాడికా ? ట్యూషనా ? హహ్హహ్హ !!

[ పియానో ధ్వనులు ]

లలిత : ఏమండోయ్ ? ...ఏమండీ ? ... మిమ్మల్నే ! ... ఏం పరధ్యానంరా భగవంతుడా ?

[ 1957 – 1958 ]

# తాతలు
# దిగి
# వస్తున్నారు

## 6

మొండివాడు రాజుకంటె బలవంతు డంటారు. తా తలపట్టిన కుందేటికి మూడేకాళ్ళని వాదించే రకం ఈ మొండివాళ్ళు. కుందేటికి మూడు కాళ్ళుండవని నేను రూఢిగా చెప్పలేను. నాలుగుండవచ్చు; రెండే ఉండవచ్చు. పెద్దబాలశిక్షో, సైన్సు పుస్తకమో, జాగ్రఫీయో చూసి చెప్పాలి. ఐతే - నేను మొండివాణ్ణి కాను కనుక తెలియదని ఒప్పేసుకుంటున్నాను. మొండివాళ్ళు తెలియదని ఒప్పుకోరు. "అబ్బాయ్! నువ్వు కుందేటికాలు ఒకటి చేత్తో పట్టుకుని, మిగిలిన మూడూ లెఖ్ఖెడుతున్నావ్ పరమానందయ్య శిష్యుడిలా! ఆ కాలు విడిచిపెట్టి లెఖ్ఖెట్టు: నాలుగూ ఉంటాయ్" అని మీరు అనచ్చు. "ఆ కాలు విడిచిపెడితే కుందేలు తుర్రుమంటుంది. ఏకాలూ కనపడదు, వెర్రిమొహమా!" అంటాడు మొండివాడు. "నేను కుందేటి కొమ్ము పట్టుకున్నా; కాళ్ళు చిల్లరగానే ఉన్నాయ్. నువ్వే లెఖ్ఖెట్టుకో!" అని కూడా అనచ్చు వాడు.

తా పట్టిన కుందేటికి మూడేకాళ్ళని మొండివాడు వాదించినా, ఎట్టి పరిస్థితుల్లోనూ కుందేటికి - ససేమిరా - మూడు కాళ్ళుండడానికి వీలు

లేదని అతడు వాదించినా, అతగాణ్ణి ఒప్పించేసరికి తాతయి దిగొస్తారు. ఇది తాతసహజం. లోకసహజం ! తాతలు మాత్రం దిగొచ్చి ఎలా ఒప్పిస్తారో తెలియదు. మొండివాడి తాతల్లాంటివారు కాబట్టి వాళ్ళకి మెలకువలు తెలుసు ననుకుంటాను.

పూర్వం తాతలంత సులభంగా దిగొచ్చేవారు కారుట. శివుడి ధనుస్సు ఎక్కుపెట్టినవాడికే, సీత నిచ్చి పెళ్ళి చేస్తానని జనకుడు ముందు డప్పు వేయించాడు. ఎవ్వరూ ఎక్కుపెట్ట లేకపోయారు. పిల్ల పెళ్ళయే సరికి తాతలు దిగొచ్చేటట్లున్నారని బెంగపెట్టుకొని మంచం పట్టాడు జనకుడు. ఈలోగా విశ్వామిత్రుడుతాతయ్యని వెంటపెట్టుకొని చక్కా వచ్చాడు శ్రీరాముడు. ఎడం చేత్తో విల్లు పుటుక్కు మనిపించాడు. సీత పెళ్ళి —— ఐదురోజుల పెళ్ళి —— మహావైభవంగా జరిగిపోయింది.

పూర్వం తాతలకి పట్టుదల ఎక్కువుండేది. తాతలుగా వాళ్ళ పరువు ప్రతిష్ఠలు నిలబెట్టుకోడానికి శతవిధాల యత్నించేవారు. తాతేతర మనుష్యులు చెయ్యలేని పనులున్నప్పుడే దిగొచ్చేవారు. చిన్నప్పుడు నన్ను పొద్దున్నే నిద్రలేపి, స్నానం చేయించి, స్కూలుకి పంపించేసరికి తాతలు దిగొచ్చేవారని మా అమ్మ చెబుతూంటుంది. మొదట్లో నేను నమ్మేవాణ్ణికాదు. నా కున్న తాత లిద్దరూ స్కూలుకి కాని, ఆఫీసుకుకాని, వెళ్ళేవారు కారు. అందువల్ల ఆలస్యంగా నిద్రలేచి, నేను స్కూలుకెళ్ళే సమయానికి మేడ దిగివచ్చే వారనుకునేవాడ్ని. వాళ్ల స్నానంచేసే సరికి వాళ్ల తాతలు దిగొచ్చేవారట ! [ ఇక్కడ నేను ముక్కుమీద వేలు వేసుకుంటున్నా : మీరు కూడా స్వేరుగా ఉంటే ఒకటి వేసుకోండి. ]

మా అమ్మ మాటలు మొదట్లో నేను నమ్మేవాడ్ని కాదు. తర్వాత తర్వాత తాతలు దిగిరావడం నా కళ్ళతో నేనే చూశాను. ఒక కథ !

కథకాదు : నిజంగా జరిగిందే : సత్యప్రమాణికం ! కావాలంటే, మీ పక్కవాడి మీద ఒట్టు.

నా స్నేహితు డొకడు పట్టిన కుందేటికి మూడే కాళ్ళున్నాయ్. అసలు నాలుగున్నాయేమో ? దార్లో ఒకటి పారేసుకు నుండవచ్చు. అసలు రెండే కాళ్ల ఉంటే, మధ్యలో మరచిపోయి మరో కుందేలు కాలు కూడా తొడుక్కు చక్కా వచ్చుండొచ్చు. ఏది ఏమైనా, మా వాడు పట్టే సరికి ఆ కుందేటికి మూడేకాళ్లు. కాని — ఎవరికా సంగతి చెప్పినా నమ్మలేదు : మొండివాళ్ల రాజుకన్న బలవంతులు :

మూడుకాళ్ళ కుందేలును పట్టిన పాపానికి మావాడు ప్రాయశ్చిత్తం చేయించుకోవల్సింది ; మందిరాల్లో, మసీదుల్లో ప్రార్ధనలు జరిపించ వల్సింది ; అధమం, శాంతికోసం, నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లైనా కొనవలసింది. ఉహుఁ ! వీడు ఇక్కడా అక్కడా గొప్పకోసం తాపట్టిన కుందేటికి మూడే కాళ్ళని చెప్పడం ప్రారంభించాడు. విన్నవాళ్ళు మొదట మందహాసంచేశారు. అది పోను పోను 'మంద' హాసంగా పరిణమించింది. మిత్రులు బాధగా మొహం పెట్టి "ఒంట్లో—బాగుండకపోతే, విశ్రాంతితీసుకోరాదూ ?" అని అడగడం ప్రారంభించారు. శతృవులు వీడు కనబడ్డప్పుడల్లా చిన్నిచిన్ని గులకరాళ్ళు - మునిసిపల్ బియ్యంలో కనబడేలాంటివి-విసరడం ప్రారంభించారు. వీడు పిచ్చివాడనీ, పిచ్చి వాళ్ళమీద తలోరాయి విసిరితేగాని పుణ్యం రాదనీ వాళ్ళ ఉద్దేశ్యం.

మావాడు నా దగ్గరికి సలహా కొచ్చాడు, "పోనీ ఇంకో కుందేలు కాలు తెచ్చి, జిగురెట్టి అతికించు" అన్నాను. ఈ సూచన నాకు నచ్చింది, కాని—"కుందేలు ఒప్పుకోటల్లేదు" అన్నాడు వాడు. "పోనీ కుందేలు కాలు ఒకటి విరక్కొట్టు" అన్నా క్లుప్తంగా. ఇది మా వాడికి నచ్చలేదు. నా కాలు విరక్కొట్టేటట్టు చూశాడు : వెళ్లిపోయాడు.

తర్వాత మా వాడు ఓ చిన్న లేనీటి విందు ఏర్పాటు చేశాడు: మిత్రుల్ని, శత్రువుల్ని అందర్నీ పిలిచాడు. కుందేలుని ఓ కుర్చీ మీద కూచోపెట్టి, మెడలో దండేసి కట్టేశాడు. సిగ్గుపడుతూ కూచుంది కుందేలు. "మిత్రులారా !..." అంటూ ఉపన్యాసం ప్రారంభించాడు. "చూశావా, ఎంత పక్షపాతమో ? మన సంగతే అఖ్ఖర్లేదూ !" అన్నారు శత్రువులంతా జాయింటుగా. "మిత్రులారా ! ఈ కుందేలును మీరు చూసేవుంటారు." అన్నాడు మావాడు. కుందేలు మరీ సిగ్గుపడిపోయింది. అందరూ కుందేలువైపు చూశారు : మూడుకాళ్ళే కన బడ్డాయ్. ఎవరి కళ్లు వాళ్లేనమ్మలేక పోయారు. మతి భ్రమ కలిగిందేమో నని భయ పడ్డారు. 'పక్క వాళ్ళేమను కుంటారు మనం ఒప్పు కుంటే ?' అనుకున్నారు.

పక్కవాళ్ళ కోసమే గదా మనం బ్రతకడం సగానికి పైగా ?

సగానికి పైగా అన్నారు : 'మూడు కాళ్ళేమిటి ? నాలుగు కనబడు తూంటే ?' అని. సగానికి లోపు అదేసమయానికి, 'రెండుకాళ్ళు స్పష్టంగా కనబడుతూంటే-మూడేమిటోయ్ ?' అన్నారు. 'ఒకటే కాలు' అన్నాడు ఒకడు. 'కాళ్ళున్నాయా అసలు ?' అని ప్రశ్నించిన 'దూరదృష్టివంతులు' కూడా లేకపోలేదు.

కుందేలుకి మూడే కాళ్ళున్నాయని వాళ్ళని ఒప్పించే సరికి తాతలు దిగొచ్చారు. "నేనే మహాపతివ్రత నైతే..." అని వీడు పసుపులేటి కన్నాంబ పోజు పెట్టి అన్నాడు. వెంటనే తాతలు అన్ని వైపులనుంచి దిగివచ్చారు. ఆ క్షణంలో ఎంతమంది తాత లున్నారంటే అక్కడ, ఒకరాయి విసిరితే ఏదో ఒక తాత నెత్తి మీద పడేది రాయి.

ఈ కథ నిజమనీ, మీ పక్కవాడి నెత్తిమీద ఒట్టేసుకు చెబుతున్నా ననీ, నేను అన్నా మీరు నమ్మడంలేదు. తెలుసు నాకు మీ మనసు. మిమ్మల్ని నమ్మించేసరికి తాతలు దిగొస్తారు. కాని ఈ కాలంలో తాతలకి

విలు వేమిటి? చాలా సులభంగా దిగొస్తున్నారు వాళ్ళు. వాళ్ళంతట వాళ్ళు రాకపోయినా, కోనసీమలో కొబ్బరికాయలు దింపినట్టు దింపు తున్నారు మనమలు.

కాకిపిల్ల కాకికి ముద్దన్నట్టు, ఎవరి తాత వాళ్ళ కిష్టం. ఆ తాత ఏం పాపం, ఏం పుణ్యం చెయ్యకపోయినా, సరదాగా పుణ్యాలు పాపాలు కల్పించి చెప్పుకు పోతుంటారు మనమలు, మనవరాళ్ళు. మా దూరపు చుట్టం ఒకావిడకి ఒక తాతగారుండేవారుట. ఆయనకి అన్నంలో పెరుగెస్తే, పెరుగెక్కువైందని అన్నం; అన్న మెక్కువైందని పెరుగూ; మళ్ళీ అదెక్కువైందని ఇదీ, ఇదెక్కువైం దని అదీ వెయ్యించుకునే వాడట. వయసులో ఉన్నప్పుడు ఆయనకి ఒక మిత్రురాలుండేదిట. డెబ్భైయోఏట నోరు తీపికోసం ఆయనకి ఎవరైనా పంచదార చిలక పెడితే, అది దాచి అరఫర్లాంగు దూరం నడిచి వెళ్ళి ఆ మాజీ చిలక్కి సగం పెట్టివచ్చేవాడుట.

మా చుట్టాలావిడ ఇంటికి వెడితే, మజ్జిగ విస్తట్లోపోసి మొదటి కథ ప్రారంభించేది. తర్వాత ఎన్నో ఎన్నో చెప్పి, చెయ్యి ఎండిపోయే సరికి పంచదార చిలక సంగతి చెప్పేది. చుట్టం కావడంవల్ల వాళ్ళ ఇంటికి ఎప్పుడో అప్పుడు భోజనానికి వెళ్ళక తప్పేదికాదు. తెలుగు వాళ్ళం కాబట్టి, అన్నంలో మజ్జిగ పోసుకోక తప్పేదికాదు. పోసుకొన్న తర్వాత ఈ కథలే వినక తప్పేదికాదు. చివరకి ఆవిడ భోజనానికి పిలుస్తూందని తెలియగానే మూటా ముల్లే కట్టుకొని పక్క ఊరుకి పోయి ప్రమాదం తప్పేవరకు దాక్కునేవాడ్ని.

పరాయివాళ్ల ఇంట్లోంచి పారిపోడం ఘనమైన కార్యం కాదు. ఎవరింట్లోంచి వారు పారిపోవలసి వచ్చినప్పుడు వస్తుంది ప్రమాదం· మా ఇంట్లో వంటావిడకి ఒక కూతురూ, అల్లుడూ, ఒక కొడుకూ, కోడలూ ఉన్నారు. కోడలంతటి గడుగ్గాయి ప్రపంచంలో లేదు; కొడు

కంతటి అమాయకుడు లేడు; కూతురంతటి మంచిది లేదు; అల్లుడంతటి అల్లరివాడు లేడు. అందర్నీ మించినవాడు ఆవిడ చచ్చిపోయిన భర్త. ఆవిడ భర్తసంగతి చెప్పి చెప్పి మిరపకాయల్ని వేయించినట్లు వేయించేస్తుంది ఎదుటివాళ్ళని. అన్నం ముందు మఠం వేసుక్కూచుంటే, సరిగ్గా ఆయన అలాగే కూచునేవా డనేది. మఠం వేసుకోకపోతే - మఠం వేసుకోకపోతే ఆయన కోప్పడే వాడనేది. కిష్టయ్యగారిలాగే మంచినీళ్ళు గుటుకూ గుటుకూ మ్రింగేవా రనేది గ్లాసులో మూడోసారి మంచి నీళ్లు పోస్తూ. ఒకసారి దోసకాయపచ్చడి బావుందని మారడిగి వేయించుకున్నాను. ఆవిడ విస్తట్లో పచ్చడి వడ్డిస్తూ, ''ఆయనకి దోసకాయపచ్చడి ఎంతో ఇష్టం. పోయినరోజు పొద్దున్న మారడిగి వేయించుకు తిన్నారు. ఏ చేత్తో వడ్డించానో ఏమో నా ఖర్మ ఇలా కాలింది'' అని రాచ్చిప్ప అక్కడే పక్కన పారేసి వంటింట్లోకి ఏడుస్తూ పరుగెత్తింది.

'పాపీ చిరాయువు :' అన్నాడనీ, నాకు ఎనభై ఏళ్లు జాతకంలో రాసిపెట్టి ఉందనీ, ఇటువంటి ఈశ్వరమ్మలు కోటిమంది వచ్చినా నా ప్రాణానికి మోసం లేదనీ మా ఆవిడకి నచ్చచెప్పేసరికి తాతలు దిగొచ్చారు. మా ఆవిడ మంగళసూత్రం కళ్ల కద్దుకొని, కుల దైవాన్ని ప్రార్థిస్తూ పగలంతా గడిపింది. సాయంత్రం అయ్యేసరికి, ఆవిడ అనుమానం నాక్కూడా ప్రాకింది. ఎందుకైనా మంచిదని మర్నాటి నుంచీ ఆవిడకి - వంటావిడకి - మూడునెల్లు పూర్తిజీతం మీద సెల విచ్చేశాం. సెలవు నుంచి వచ్చేసరికి, చుట్టాలింటికి శాశ్వతంగా బదిలీ చేశాం. యుద్ధంలో మరణించి వీరస్వర్గం చూరగొనడానికి అభ్యంతరం లేదు; కాని దోసకాయపచ్చడి మారడిగి చచ్చిపోదల్చుకోలేదు.

ఈశ్వరమ్మగారిని పిలిచి ఆవిడభర్త మూడుకోట్ల తెలుగువాళ్ళలో ఒకడని, ఆయనలో ప్రత్యేకత ఏమీ లేదని చెప్పవచ్చు; కాని, చెప్పి,

ప్రయోజనం లేదు. ఆవిడ మొగుడు ఒకప్పుడు ఆవిడకి ప్రత్యక్షదైవం. ఇప్పుడు అదృశ్యదైవం.

కాని — మనుష్యు లందరూ ఒకలా ఉండరు. అందులో భారత దేశంలో 'ఏ' అనే వాడు స్కూల్లో నాటకంలో ఆడవేషం వేసుకుని బహుమతి తెచ్చుకు నుండవచ్చు; మరెప్పుడో మెడలో దండెయ్యించు కొనుండొచ్చు; కాంగ్రెసులోచేరి జెయిలుకెళ్ళుండొచ్చు; మినిష్టరో వైస్ ప్రెసిడెంటో కావచ్చు. అంతమాత్రంచేత వారు చెప్పింది వేదం అనో చేసిందే మంచిదనో మనం ఎందు కనుకోవాలో నాకు తెలియదు. ఒక వేళ అలా అనుకున్నా, వాళ్లతమ్ముళ్లు, మేనమామకొడుకులు, ఒక వేలు విడిచిన మనవరాళ్లు మన్ని ఎందుకు పీడించుకుతినాలో అర్థం కాదు.

దేశంలో పేరు సంపాదించుకున్న కథకచక్రవర్తి ఒకాయిన్ని నేను ఎరుగుదును. పొరపాటున ఆయన పెళ్లానికి తమ్ముడై పుట్టిన ఒకకుర్రాడు, అది అర్హతగా తీసుకొని, సాహిత్యానికి విలువలు కడతానంటాడు. అంతే కాదు; కాఫీలో పంచదార ఎక్కువ వేసుకుంటానంటే, 'మా బావ అసలే వేసుకోడు' అని అయాచితంగా మనకి సలహా ఇస్తాడు. తను కూడ వేసుకోకుండా గుటగుటా తాగేస్తాడు. మరో కవయిత్రిగారి కూతురు, తల్లికి బ్రతికున్నరోజుల్లో కుక్కలంటే ఇష్టమని తాను కుక్కల్ని పెంచ టమేకాక, తన మొహల్లాలో అందరికీ కుక్కల్ని కొని దానం చేసింది. చచ్చిపోయిన ఒక గవర్నరుగారి మనవడు మా ఊళ్లో చిల్లరగా తిరుగు తున్నాడు. కంచంలో అన్నం తినడం దగ్గర్నుంచీ, కార్డుకి ఒకేపక్క రాయడంవరకు ఆయన చేసినట్టే అందరూ చేస్తేకాని అంగీకరించడం లేదు అతను.

చిన్న చిన్న విషయాలలో కూడా తాతల్ని, తండ్రుల్ని సాక్ష్యం కోసం కోనసీమ కొబ్బరికాయల్ని దింపినట్టు దింపే ఆచారం బహుశః

మన తెలుగుదేశంలోనే ఉంది. బహుశః! ఇతర దేశాల్లో ప్రతీవ్యక్తి తనకి వ్యక్తిత్వం ఉందని నిరూపించుకోడానికి యత్నిస్తా డనుకుంటాను. ఇక్కడ 'నువ్వింత అసమర్థుడుగా పనిచేశావేం?' అంటే — "మా తాత చాలా గొప్ప సమర్థుడు" అని సమాధానం ఇస్తాడు. 'నువ్వు ఫలానాది ఘోరంగా రాశావేం?' అంటే నన్నయది మా ఊరే తెలుసా పొమ్మంటాడు.

తాతలు దిగిరావడం అన్న ప్రయోగం బహుశః ఇందువల్లే దిగి వచ్చిందేమో? కాని మన అలవాట్లు మానిపించే తాతలు దిగివస్తే బాగుణ్ను.

[ 1960 ]

## రా జ కీ య ము - సా హి త్య ము

సాహితీపరులు పలువురు రాజకీయవేత్త లౌతున్నారు. ఇది దేశానికి మంచిదని మనం గట్టిగా చెప్పలేం. అధికారంలో ఉన్న వ్యక్తులు తమకు సాహిత్యంలో పరిచయం కలదని భ్రమపడి కవిత్వం పలకడం ప్రారంభిస్తున్నారు. ఇది దేశానికి మంచిదని అసలే చెప్పలేం.

మనిషై పుట్టిన ప్రతీవాడికి 'కవిత్వం' పలకడానికి హక్కుంది. దీనివల్ల ఎన్ని ప్రమాదాలున్నా, కాలం ఆ ప్రమాదాలను తొలగిస్తుంది. కాని రాజకీయవేత్తలు తాము విద్యావేత్తలమని భ్రమించి విద్యావిధానాలను సవరించడానికి చేసే యత్నాలవల్ల కలిగే ప్రమాదాల పరిణామాలు ఊహించడానికి కూడా కష్టమైనవి.

'రాజధాని కబుర్లు' - 18-2-59

# అద్దెకొంపలో
# పరీక్ష
# చదువులు

## 7

[ "ఆకాశవాణి" అన్న announcement : మరు క్షణంలో చెంబులు గిన్నెలు ఒకదాని మీద ఒకటి పడిన చప్పుడు. చెంబులు తెరలుగా దగ్గిన శబ్దం. ఒక అరసెకను నిశ్శబ్దం. ఇంకొక చెంబు జారి పడిన చప్పుడు. అనంతరం : 'అద్దెకొంపలో పరీక్ష చదువులు : నాటిక' etc. announcement. ఈ announcement జరుగుతున్నంత సేపు నేపథ్యంలో అనేక రకాల చప్పుళ్ళు : 1. పోపు కలుపుతున్న గరిటె చప్పుడు; దగ్గు. 2. బిందెలో ఏకధారగా నీళ్ళు పట్టుతూన్న ధ్వని. 3. రేడియో 'ట్యూనర్' ఇటూ అటూ బరబరా తిప్పుతూన్న చప్పుడు. 4. 'ఏరువాకా సాగాలంటే...' అంటూ అపస్వరంతో ఒక అమ్మాయి పాట. 5. కేరుమని ఏడ్చే కుర్రాడు. 6. 'హెన్రీ ది ఎయిత్ తరువాత హెన్రీ ది నైన్త్ రాజ్యమునకు వచ్చెను. ఇతడు మంచివాడే కాని అసమర్థుడైన రాజు. ఇతని రాజ్యమున కాలము – కాదుకాదు కాలమున రాజ్యము – అరాజకమై ... ఇతని కాలమున రాజ్యము అరాజకమై

ప్రజలు...ప్రజలు...' అంటూ హిస్టరీ పాఠం చదివే కుర్రాడి కంఠం. ఈ శబ్దాలన్నీ కలిసీ, వేరువేరుగా వినబడతాయి. Announcement పూర్తికాగానే ఈ శబ్దాలన్నీ ఒక్కసారి ఘట్టిగా వినపడి ఫేడౌట్ అయి పోతాయి. అన్నిటికంటె చివరన నారాయణమూర్తి కంఠం ఫేడిన్ అవుతుంది. ]

మూర్తి : [చదువుతూంటాడు] Arthur Hallam died in 1833 and Alfred Tennyson wrote In Memoriam to mourn the death of his beloved friend, It is in the form of an elegy ... ఎలెజీ ! ఎలెజీ ఆ ? ఎలెజీ అంటే ఏమిటోయ్ శంకరం ?

శంకరం : Elegy అంటే ఏమిటో తెలియకుండా నువ్వు M. A. పరీక్ష కెల్లా కూర్చుంటావోయ్ ? ఒక కవిగాడుంటాడు. వాడికొక ప్రాణమిత్రు డొకడుంటాడు. వాడు చచ్చిపోయాడనుకో.

మూర్తి : అనుకో ఏమిటి – అక్షరాలా చనిపోతే ? 1833 లో. హేలమ్ గాడట వాడిపేరు. వాడి చావు కాదుకాని మన చావుకొచ్చింది. చచ్చినవాణ్ణి సరిగ్గా చావనివ్వక – వాడో పుస్తకం రాసి మన్ని చంపడం దేనికి చెప్పు. రేపు నువ్వు చచ్చిపొయ్యావనుకో...

శంకరం : అదేం మాటోయ్ – తాడి చెట్టులా నేనిక్కడ బ్రతికుంటే...

మూర్తి : అహఁ మాటవరసకంటున్నాను. నువ్వు తాడి చెట్టులా బ్రతికున్నావన్న సంగతి నేను కాదన్నానా ? ... నువ్వు నా ప్రాణస్నేహితుడి వనుకో. నువ్వు చచ్చిపోతే నేను ఒక కావ్యం రాసి పారేస్తాననుకున్నావా ? ఉహుఁ. ఖాళీ ఉంటే బారుమని ఏడుస్తా। అదీ లేకుంటే నోరు మూసుకుని

కూర్చుంటా .... ఆ హేలమ్ చచ్చిపోతే ఈ టెన్నిసన్ పుస్తకం రాయడమా ? ఆ పుస్తకం మీద పుస్తకాలూ ? .... ఆ పుస్తకాల మీద పుస్తకాలా ? ... ఆ పుస్తకం, ఆ పుస్తకం మీద పుస్తకాలు ; ఆ పుస్తకాల మీద పుస్తకాలూ - మన ఖర్మంకాలి మనం చదవవలసి రావడమా ? 'In Memoriam' కాదు నా శ్రాద్ధం ! ...

శం : శ్రాద్ధం అంటే జ్ఞాపకం వచ్చింది .... చచ్చినవాడికి ఏటేటా తద్దినం పెట్టి ఏడవమంటారుగా మనవాళ్ళు ?

మూర్తి : తద్దినం పెట్టమన్నారు సరే ! ... ఏడవ మనలేదే ! పైగా ఆస్తి తీసుకున్న పుత్రరత్నం ఏడాది కొకరోజు ఆమాత్రం చెయ్యలేడూ ? ఈ హేలమ్‌గాడు మనకేమయినా ఆస్తిచ్చాడా ? ఇల్లిచ్చాడా ? వాడి తద్దినం మనం పెట్టడానికి ? .... తద్దినం అంటే జ్ఞాపకం వచ్చింది ఈ ఏడాది మా నాన్నగారి తద్దినం సరిగ్గా పరీక్షల ముందు వచ్చింది .... ఏయ్ ... ఇదుగో .... లలితా ! ....

లలిత : [లోపలినుంచి] ఆఁ

మూర్తి : ఈ సంవత్సరం నాన్నగారి తద్దినం ఎప్పుడైందే ?

లలిత : [లోపలినుంచే] ఈ నెల 20 వ తారీఖున ... ఒకసారి ఇల్లా వస్తారా ?

మూర్తి : కాఫీ తయారయిందా ?

శం : ఇప్పుడు కాఫీ ఎందుకోయ్ - నీకు మతి పోయిందా ఏమిటి ?

మూర్తి : మతి పోవడమేమిటోయ్ ? పరీక్షలన్న తర్వాత పదకొండింటి

పరక్షైనా చదవాలా ? ఎనిమిదింటికే అన్నం తింటే - సరిగ్గా ఎనిమిదీ ఒకటికి గాఢంగా నిద్రవస్తుంది....పదకొండింటి వరకూ తినకపోతే ప్రాణాలంటూ ఉండవు. అందుకని, ఈ లోపుగా కాఫీలాంటిది తగలేస్తే...ఇప్పుడు టైమెంతయింది ? ఇండియన్ స్టాండర్డు టైమ్‌కి అనుసార్ - టుంటే - ఠీక్ ఆఠ్ భజకర్...మినిట్ హోగయా ! ...

లలిత : [లోపలనుంచి] వస్తున్నారా ?

మూర్తి : ఆఁ వస్తున్నా.

[హఠాత్తుగా రైలు కూత - రైలు వచ్చి వెళ్లిన చప్పుడు - పది పదిహేను సెకనుల వరకు మాటలు వినపడవు.]

మూర్తి : ఇదీ తంతు. పగలంతా పిల్లల అల్లరి. రాత్రిపూట పక్కింటి వారి పిల్లాడు పొకటే ఏడుపు. వాడు రాత్రి పడుకుంటాడో పగలు పడుకొంటాడో తెలిస్తే దేవుడికో కొబ్బరికాయ కొడతాను. సరిగ్గా నేను పుస్తకం తెరచి మొదలెట్టేసరికి రాగం ఎత్తుతాడు. నేను పుస్తకం తెరిచి - 'Twinkle Twinkle Little Star, How I wonder ...'

[హఠాత్తుగా పక్కింటి పిల్లాడి ఏడుపు. అది fade out అవుతూండగానే మూర్తి మాట్లాడడం మొదలెడతాడు]

మూర్తి : చూశావా ? నేను చెప్పలేదుటే ? వాడు నా చదువు సంగతి ఇట్టే పసికడతాడు. ఈ కాచిగూడా కాదు, పేచీగూడాలో ఇల్లెప్పుడు తీసుకున్నామోగాని...

లలిత : నేను చెబితే మీరు విన్నారూ ? నారాయణగూడాలో సినీమా హాలు కెదురుగుండా మేడమీద వాటా - రెండు గదులూ,

పంటిల్లూ - పెద్దడాబా. డాబామీద హాయిగా పడకకుర్చీ వేసుకు కూర్చోవచ్చు. చదువుకో వచ్చు.

మూర్తి : సరే! సినీమాహాలు కెదురుగుండా డాబా! డాబామీద పడక కుర్చీ. ఇంక చదువు సాగాల్సిందే! పైగా నెలకి నలభై ఐదు రూపాయలు తగలెట్టి...

లలిత : ఇక్కడ మాత్రం తక్కువిస్తున్నామా ఏమిటి? నెలకు ముప్ఫయి చెల్లించి పైన ఎలక్ట్రిబిల్లు ఇచ్చుకుంటూనే ఉన్నాం. రోజూ బిందెలకొద్దీ నీళ్లు మోసుకురాలేక నా చేతులు పడి పోతున్నాయి... ఐనా, ఇవన్నీ మీ కెందుకులెండి? ఒకప్పుడు పట్టించుకున్నారు కనకనా? మీ చదువులేమిటో మీ స్నేహితు లేమిటో? మీరు చదువుకుంటానని రాత్రి పూట బయటకు పోతే...

మూర్తి : బయటకు పోతే?

లలిత : ఏముంది? పక్కనే శ్మశానమయ్యె! పిల్లలేమయిపోతారో నని రాత్రి మీరొచ్చే వరకు కాపలా కాసుక్కూర్చుంటున్నాను. ఇవన్నీ మీ కెందుకు కావాలి లెండి?

మూర్తి : [వేళాకోళంగా] దేఖ్ తేరీ సంసార్ కి హాలత్, క్యా హో గయా భగవాన్? సూరజ్ న బదలా... చాంద్ న బదలా... ప్రపంచక మంతా మారిపోయిందయ్యా, భగ వాన్! ఆడవాళ్లు మాత్రం మారలా!

లలిత : వేళాకోళం చెయ్యండి! మీ ఇష్టం వచ్చినట్టుగా పరిహాసం చెయ్యండి. మీకేం? మిమ్మల్ని అందరూ మంచివా డనే అంటారు. [సాగతీసుకుంటూ] 'మూర్తి కేం? బంగారం

లాంటి మనిషి. ఎప్పుడూ నవ్వుతూంటాడు. ఆ పెళ్ళామే ఉత్తి గయ్యాళి' శ్రీరామచంద్రమూర్తీ! ఆపద్బాంధవా! అనాధ రక్షకా! మళ్ళీ జన్మలో నన్ను నీ ఇష్టం వచ్చినట్లుగా చెయ్యవయ్యా, భగవంతుడా! కాని మంచివాడికి మాత్రం పెళ్ళాంగా పుట్టించకు.

మూర్తి : [ వెటకారంగా ] 'పెళ్ళాంగా పుట్టించకు'. భగవంతుడు ఏ ఆడదాన్నీ పెళ్ళాంగా పుట్టించడు. పుట్టిన తర్వాతే పెళ్ళి చేసుకుని పెళ్ళాలవుతారు.

లలిత : ఆఁ వేళాకోళాలు చేశారు కాని .... చేతిలో కాఫీ చల్లారిపోతూంది. ఆయనకు ఇచ్చిరండి.

మూర్తి : ఒరేయ్ శ్రీహరీ ! .... శ్రీహరీ ! ...-

శ్రీహరి : ఏం నాన్నా ?

మూర్తి : ఈ కాఫీ పట్టుకెళ్ళి శంఖరం మామయ్య కిచ్చిరారా ! .... ఏమోయ్ శంకరం ! ఇప్పుడే వస్తున్నా - One Minute .... ఇప్పుడు చెప్పు .... నీకేం ఆపద వచ్చిందో ? ఆ నాడు హరిశ్చంద్రుని భామ అయిన సత్యభామ - I mean - చంద్రమతి ...

లలిత : అదిగో మళ్ళీ మొదలెట్టండి వేళాకోళాలు ! మీరిల్లా వేళాకోళాలు చేస్తూండండి. అవతలవాళ్లు వాళ్ళిష్టం వచ్చినట్టు అంటూంటారు.

మూర్తి : [ సీరియస్‌గానే ] ఇంతకీ నిన్నిప్పు డెవరేమన్నా రంటావ్ ?

లలిత : ఆ పక్కవాటా వాళ్ళ కమల లేదూ ? 'మేష్టారు మేష్టారు మెట్టంకాయ—మేష్టారి పెళ్లాం నీరొంకాయ' అంటూ ఘట్టిగా పాడటం మొదలెట్టింది.

మూర్తి : పాడితే నువ్వెందుకే ఉడుక్కోడం ? ఆ పాట వల్ల నేను మెట్టంకాయ అయ్యానా ? నువ్వు నీరొంకాయ అయ్యావా ? ఆ మాట కొస్తే నాకు చిన్నప్పటినుంచీ వంకాయ కూరంటే ఇష్టమే లేదు. మా అమ్మ అంటూండేది : " ఒరేయ్ వెధవాయ్ ! అన్ని కూరలు తినకపోతే..."

లలిత : అబ్బబ్బ ! చచ్చిపోతున్నాను బాబూ ! మీ గొడవ మేది. ఏమీ వినిపించుకోరు.

మూర్తి : వినిపించుకుంటాను. దేముడి మొహం చూసి, గుండెలమీద చెయ్యివేసుకుని, రెండోచేత్తో నీ కొంగు పట్టుకుని ప్రమాణం చేస్తున్నాను : "ప్రాణేశ్వరీ ! చంద్రవదనా ! లలనా ! లలితా ! నువ్వేమన్నప్పటికీ, ఎప్పుడన్నప్పటికీ, కలలోనైనను కావరంబుననైన నీ మాట – అవసరమైతే నీమాటలు – వినిపించుకు తీరతాను . . తీరతాను . . తీరతాను . . ఆమెన్" [ ఒక సెకను రెండు సెకనులు నిశ్శబ్దం ] కోపం వచ్చినట్టుంది. ఇటు చూడు. మేష్టరు ఉద్యోగం చేసిన వాడెవడైనా ఎవరైనా ఏదైనా అంటే పడడానికి సిద్ధంగా ఉండాలి. నీరొంకాయ అన్నందుకు అంత బాధపడుతున్నావే ! నన్ను స్కూలులో ఏమని పిలుస్తారో తెలుసా ? శంకరాన్ని ఏమని పిలుస్తారో తెలుసా ?

లలిత : ఇంట్లో ఏమంటున్నారో తెలుసు లెండి. బయట ఏమంటున్నారో తెలుసుకోనక్కర్లేదు.

మూర్తి : చూడు, లలితా. నేను సీరియస్‌గానే మాట్లాడుతున్నాను. అన్నవాళ్ళు పదిమాట లంటూంటారు. అవన్నీ పట్టుక్కూర్చుంటే బ్రతుకే కష్టమై పోతుంది. పక్కవాటాల వాళ్ళలో మంచివాళ్ళుంటారు, చెడ్డవాళ్ళుంటారు. మంచివాళ్ళతో స్నేహం చెయ్యి. చెడ్డవాళ్ళ జోలికి పోకు. అందరితో దెబ్బలాడితే మనం మాత్రం ఎక్కడికి పోగలం చెప్పు.

లలిత : అయితే ఈ పోట్లాటల కన్నిటికీ నేనే కారణం అంటారు. ఛీ నేను పుట్టిన తర్వాత ఎవరిచేత మాట అనిపించుకోలేదు. కట్టుకున్న మొగుడే మాటలంటూంటే పరాయివాళ్ళు అన్నారంటే ఆశ్చర్యమేముంది ? అందుకే ఆయన ఈవాళ అల్లాగన్నాడు.

మూర్తి : ఎవరెలాగ అన్నారంటావ్ ?

లలిత : ఎందుకులెండి ? మీరు వెళ్ళి చదువుకోండి. చాంతర్వాత మీ చదువు పాడు చేశానని నన్ను సాధిస్తారు.

మూర్తి : ఇంతకీ ఎవరన్నారే ?

లలిత : ఇంకెవడూ ? ఆ ఫాడ్కేగాడే ! వాడుట్టి రుచ్ఛుడండీ. మీతో ఈ విషయాలన్నీ చెప్పకూడదు కాని వాడి చూపులు విషపు చూపులండీ. ఒంట్లో చిల్లులు పొడిచేసేటట్లు చూస్తాడు.

మూర్తి : అబ్బబ్బ ! అసలు విషయమేమిటే ?

లలిత : మనపిల్లలు అసలు చాలా మంచివాళ్ళండి. ఎవరి జోలికి పోరు...

మూర్తి : అబ్బెబ్బె ! పీక్కుంటే - పొకళ్ళ జుట్టు ఒకళ్ళు పీక్కుంటారంతే !

లలిత : బయటకు తోసినా - బయటకు వెళ్ళి ఆడుకోరు. చిన్నా డంటాడు : 'ఎందుకమ్మా! మనింట్లో మనం రాజులం. బయటకు పోతే దొంగలం' అని. ఈ నాలుగు రోజుల్నించీ- మీరు పాపం చదువుకుంటున్నారని బయటకు తోస్తున్నాను. ఆ ఫాడ్కేగాడికో చంటి పిల్లాడున్నాడు. మన చంటిదానికి పిల్లలంటే సరదా. 'వద్దు వెళ్ళకే!' అంటూంటే - పోయి, ఆ పిల్లాణ్ణి ఎత్తుకుంటోంది. [కంఠం తగ్గించి, రహస్యం చెప్పి నట్టు] ఆ చంటిపిల్లాడు ఓ రాక్షసి. ఉన్నట్టుండి [మళ్ళీ రహస్యంగా] బరుకుతాడు. పిల్ల ఏదో చేసిందిట. దాంతో ఆ ఫాడ్కేగాడు బరబరా పిల్లను మేడమెట్లపై ఈడ్చుకు వచ్చాడు.

మూర్తి : ఆరి వెధవా అని!

శంకరం : మూర్తీ! మూర్తీ!

మూర్తి : వస్తున్నానోయ్, శంకరం!..ఊఁ అప్పుడు నువ్వేం చేశావ్?

లలిత : మీరు వెయ్యి చెప్పండి - లక్ష చెప్పండి. మన పిల్లల మీద ఎవరైనా చెయ్యి చేసుకుంటే నేనూరుకునేది లేదు. మీరు చావమంటే చస్తాను - ఏనూతిలోనో గోతిలోనోపడి. కాని నాపిల్లలను ఏమీ చెయ్యనివ్వను.

మూర్తి : ఇంతకీ ఏం చేశావ్?

లలిత : ఏం చేస్తాను? కడిగి కడిగి విడిచి పెట్టాను. తండ్రిలేని సమయం చూసి పిల్లలను ఇలా చేయడం ఎక్కడ నేర్చు కున్నావ్? అని అడిగాను. 'మీరలా అనడం న్యాయం కాదు. మీవారు వచ్చిన తర్వాత మాట్లాడతానులెండి' అన్నాడు నంగనాచిలాగ. 'ఏమయ్యోయ్! ఏమిటయ్యా

నువ్వు మాట్లాడేది ? అంత బుద్ధే ఉంటే ఆయనున్నప్పుడే రాలేకపోయినావా ?' అని అడిగేశాను....మీరెన్నన్నా చెప్పండి చూసే నా పిల్లల్ని ఎవరన్నా నేను మాత్రం ఊరుకోను.

మూర్తి : నిన్ను ఊరుకోమని ఎవడు చెప్పాడు ? నువ్వు చాలా మంచి పని చేశావు ! లలితా ! నా పెళ్ళాం ఇటువంటి దయినందుకు చాలా గర్విస్తున్నాను. మగవాళ్ళు వెయ్యిపనులమీద బయటకు పోతుంటారు. ఆడవాళ్ళు అమాయకులైతే - ఏడిపిద్దామని చూసేవాళ్ళు చాలామంది ఉంటారు.

లలిత : మీరలాగే అంటూండండి నా దగ్గర ! బయటకెళ్ళి వాళ్ళదగ్గర కెళ్ళి 'Yes Yes Yes' అంటూంటే సరి. అందరూ 'ఆహాహా! ఆయనెంత మంచివాడు ?' అంటూంటారు.

మూర్తి : అంటారా ? ఏడవలేక పోయారు. ఇప్పుడెళ్ళి వాళ్ళపని పట్టించనూ ? మగవాళ్ళు లేని సమయం చూసి - ఆడవాళ్ళతో పోట్లాట కొస్తాడు త్రాష్టుడు !

లలిత : [నెమ్మదిగా] అసలిదంతా వాడిపెళ్ళాం చేసిందండీ ! ఎంత పరమ గయ్యాళి అనుకున్నారు ? పెళ్లాం చెప్పిన మాట విని- కుక్కిన పేనులా ఉంటాడు. బయట కొచ్చే - ఈ గడ బిడంతా !

శంకరం : మూర్తీ ! మూర్తీ ! నేను వెళ్లిరానా ?

మూర్తి : వస్తున్నానోయ్, శంకరం ! ... చూడు, లలితా. పోనీ శంకరాన్ని ఈవాళకి భోజనానికుండమంటేనో ?

లలిత : నేను చెయ్యలేనండీ ! రాత్రయేసరికి కాళ్ళూ చేతులూ పడి పోతున్నాయి. ముందరే చెబితే ఇంకో కూర వండి పారేశే దాన్ని ... అలా అంటే మీకు కోపం వస్తుందా ?

మూ_ర్తి : అచ్చే ! [కొంచెం గట్టిగా] అబ్బెచ్చే ! లేదు దీనికి కోపం దేనికి ?

పక్కింటి కుర్రాడు : హెన్రీ ది నైన్త్ అసమర్ధుడైన రాజు, ఇతను చాల మంచివాడు. ఇతని మంచితనము చూసి మంత్రులు ... [పాట రూపంలో] హెన్రీ ది నైన్త్ అసమర్థుడైన రాజు. ఇతను చాల మంచివాడు ... అకోక్కయ్ ! అక్కాయ్ ! పెద్దక్కా ! హెన్రీ ది నైన్త్తే - మరిట ... [నెమ్మదిగా అతని voice fade out అయిపోతుంది]

మూ_ర్తి : Excuse me, శంకరం ! చాలా ఆలస్యమయిపోయింది.

శంకరం : అచ్చేబ్బే ! ఆలస్యానికేముందిలే ?

మూ_ర్తి : నువ్వీవాళ ఇక్కడే భోజనం చెయ్యకూడదూ ?

శంకరం : నో, నో, - నా wife కనిపెట్టుకూర్చుంటుందోయ్ !

మూ_ర్తి : అలా అంటే నేను బలవంత పెట్టలేననుకో ... కాని నువ్వు మా ఇంట్లో మొహమాట పడవలసిన అవసరం లేదు. నా wife ఇప్పుడే అంటోంది. లలితా ! శంకరం భోజనానికి ఉండనంటున్నాడు.

లలిత : వదినగారేమీ కోప్పడరు లెండి, అన్నయ్యగారూ !........ మా ఇంట్లో భోజనం చెయ్యొచ్చు. మేమంత డబ్బున్న వాళ్ళం కాకపోయినా——

శంకరం : మీ రలా అంటే నేను అంగీకరించ వలసి వస్తుందనుకోండి !

మూ_ర్తి : [ ఖంగారుగా ] ఇప్పుడు కాకపోతే సరిగాని, శంకరం, ఈ మాటైనా నువ్వు మా ఇంట్లో భోంచేసి తీరాలి ! మీ చెల్లెలు వంట చాలా బాగా చేస్తుంది.

శంకరం : ఓ. అలాగే – అంతకంటేనా ? ఈమాటెప్పుడైనా ముందే చెప్పి, నేనూ మీ చెల్లెలూ ఇద్దరం వస్తాం – పిల్లల్ని తీసుకుని.

మూర్తి : పిల్లలంటే జ్ఞాపకం వచ్చిందోయ్, శంకరం. I am very much worried. ఈ ఇంటివాడున్నాడు చూశావూ, ఓ మహారాష్ట్రుడు – త్వాష్ట్రుడు. ఆ పక్కనున్న వాడొక తెలుగు వెధవ. మన తెలుగు వాళ్ళలో unity ఏడవదోయ్– వెయ్యిశతాబ్దాలు గడిచినా. నేను వాడి తల్లి చచ్చిపోతే – ఎవరూ లేక ఏడుస్తూంటే – వెళ్ళి శవం మోశాను. కాస్తా కూస్తా బరువనుకున్నావా ఏమిటి ? భుజాలు కాయలు కాసిపోయాయి. Gratitude అనేది ఉండాలా ? No, not a bit. వాడి పిల్ల వచ్చి "మేష్టారు మేష్టారు మెట్టంకాయ్" అంటూ మా ఆవిణ్ణి ఏడిపిస్తూందిట.

లలిత : కాస్త మధ్యాహ్నం పూట కునుకు తీద్దామనుకునేసరికి రేడియోబర్రుమని పెట్టి గరగర లాడిస్తుంది.

మూర్తి : మనం చదువుకుందామంటే – ఆ కుర్రకుంక హిస్టరీ పాఠం ఎంత గట్టిగా చదువుతున్నాడో చూశావుగా ?

లలిత : నీళ్ళ గదిలో పంపు తిప్పేసి, మేం తిప్పేశామని ఇంటి వాళ్ళతో చెప్తొస్తారు.

మూర్తి : మేడ మెట్లమీద లైటుఫేసి మేం వేశామని చెప్తొస్తారు.

శ్రీహరి : నువ్వు చదువుకుందామనే సరికి, పిళ్ళాణ్ణి గిల్లి ఏడిపిస్తారు, నాన్నా.

లలిత : నిన్న మధ్యాహ్నం మీరు సైకిలక్కడ పెట్టుకున్నారా - ఆ కుర్రకుంక వచ్చి గాలిప్పేస్తున్నాడు. నన్నుచూసి ఇంట్లోకి పరుగెత్తాడు.

మూర్తి : ఏం చెప్పాలి, శంకరం ? నువ్వే చూద్దుగాని .... (గట్టిగా) When Hallam died, Tennyson wrote a poem. When poem died, Hallam wrote Tennyson, when ... ...

[ కేరుమని పక్కింటి పిల్లాడి ఏడుపు ]

చూశావా ? చూశావా ? ? నీ కళ్ళతో నువ్వే విన్నావుగా ? ఇదీ వరస. ఇదీ తంతు. ఏం చెయ్యాలి చెప్పు. ఈ వాళ మధ్యాహ్నం మూడు గంటలికి స్కూలునించి వచ్చి, గబ గబా రెండు మెతుకులు నోట్లో వేసుకొని - కాసేపు చదువు కుందామని స్టేట్ లైబ్రరీకి పరుగెత్తాను. వాడు - ఆ మహా రాక్షసుడు - త్వాష్ట్రుడు - ఏంచేశాడో తెలుసా ? పిల్లాడు...

శంకరం : విన్నానోయ్. ఇందాక ఆవిడ చెబుతుంటే విన్నాను. చూడు మూర్తీ. ఈ విషయం వాడితో వెళ్ళి ఒకసారి మాట్లాడ కూడదూ ? దెబ్బలాడి, ప్రయోజనం లేదు. వాడు దుర్మా ర్గుడే అనుకో. అయినా, పరీక్షల ముందు దెబ్బలాడి తట్టుకో గలవా నువ్వు?

మూర్తి : అయితే - ఏం చేయమంటావ్ ?

శంకరం : ఏం లేదు. ఓసారి పోయి ఘట్టిగా మాట్లాడిరా. దాం తరవాత చిన్న చిన్న విషయాలు చూసీ చూడనట్టుగా ఊరుకో.

మూర్తి : అంతావా ? అయితే సరే. నువ్వుకూడా నాతో వస్తే బాగుం టుందేమో కాదూ ? Two is better than one.

శంకరం : అల్లాకాదు. నేనిక్కడే కూర్చుంటాను. అన్నీ వినబడుతూనే ఉంటాయిగా ? వాడు అంతకీ చెయ్యిచేసుకుంటే - నేనూ వచ్చి కలియపడతాను.

[ ఓ పదిసెకనుల నిశ్శబ్దం. తరవాత కొద్ది దూరనుంచి మూర్తిగొంతు. అంతకంటె కొంచెం దూరంలో ఫాడ్కే గొంతు ]

మూర్తి : మిస్టర్ ఫాడ్కే ! మిస్టర్ ఫాడ్కే ! !

ఫాడ్కే : హూ ఇజిట్ ?

మూర్తి : I am Murthy! మీ రివాళ మధ్యాహ్నం మా ఇంటికి వచ్చి చేసిన అల్లరి ఏమీ బాగాలేదు. నేను నీతో మాట్లాడాలి.

ఫాడ్కే : అక్కడనుంచి మాట్లాడొచ్చు.

మూర్తి : మగవాళ్ళు లేని సమయం చూసి మీరు చేసిన అల్లరి ఘోరం! ఘోరాతి ఘోరం! మనకు రాజ్యాంగం అంటూ ఉంది. నాకు శాంతియుతంగా జీవించడానికి సర్వహక్కులు ఉన్నాయి. మీరు వెంటనే క్షమాపణ చెప్పుకోకపోతే పోలీసులకు రిపోర్టు చేస్తాను.

లలిత : [ పైనుంచే ] పరువు నష్టం దావా వేస్తాం !

మూర్తి : నువ్వు బయటకు రాకపోవడం నీ పిరికితనాన్ని తెలియ చేస్తూంది.

ఫాడ్కే : నేను పిరికి గాదు ; నువ్వే పిరికి. Don't speak nonsense!

లలిత : నాన్సెన్సా ? నువ్వు సెన్సు కాబోలు ! నువ్వే నాన్సెన్సు - నీ పెళ్ళాం నాన్సెన్సు.

ఫాడ్కె : నీ పెళ్ళాన్ని నోరు మూసుకోమని చెప్పు.

మూర్తి : ఆ మాట అనడానికి నీకు ఏ చట్టం అధికారం ఇచ్చింది?

లలిత : వాడి పిండాకూడు చట్టం ! నా నోరుమూసే వాడు ఈ ప్రపంచకంలో పుట్టలే దింకా.

మూర్తి : నా హృదయం అగ్నిపర్వతం లాంటిది. అది ప్రేలుతుంది. ప్రేలిననాడు పశ్చాత్తాపానికి తావులేదు.

లలిత : మీరు కనక ఊరుకున్నారు. ఇంకొకళ్ళయితే ఏ నాడో సాచి తన్నేవారు. మగవాళ్ళులేని సమయం చూసి...

మూర్తి : సహించాను. సహించాను. నా గృహశాంతి నా కళ్ళఎదుటే భగ్నం అవుతూంటే - ఇక నేను సహించలేను. మంచివాడి మనస్తాపం మహామారణకారకం !

ఫాడ్కె : నువ్వు మంచివాడు కోన్ బోలా ?

మూర్తి : నేను బోలా ! మై బోలా ! సబ్ లోగ్ బోల్తేహైఁ !

లలిత : లేకపోతే నీ ఏడుపుగొట్టు మొహానికి నువ్వు బోల్తా వేమిటి ? అయ్యో చోద్యం ! _రండి లోపలికి. మధ్యన మీ పరీక్ష పాడాయెరి!

[ పది పదిహేను సెకనుల నిశ్శబ్దం ]

మూర్తి : చూశావుటోయ్, శంకరం ! మొట్టమొదట ఫాడ్కె అంటే ఏమిటో అనుకున్నాను. కొద్దిగా భయంకూడా వేసింది. ఎప్పుడోఒకసారి యుద్ధంలో తగలడ్డాట కూడా. కాని ఉత్తి

పిరికి వెధవలా ఉన్నాడోయ్. గది తలుపు లోపల గడియ పెట్టుకొని కూర్చున్నాడు. మేడమెట్లమీద నుంచుని 'ఒరేయ్ వెధవాయి, బయటకు రావోయి' అన్నాను. ఉహూఁ బయటకు రావడానికి వాడికి ధైర్యమెక్కడిదోయ్ ! విన్నావుగా ? గట్టిగా దబాయించి పారేశాను...

శంకరం : మూర్తీ ! .... నిన్నోమాట అడుగుతాను. నువ్వేమీ అనుకోకుండా ఉండే.

మూర్తి : ఏమిటది ?

శంకరం : నువ్వెప్పుడైనా నాటకాలలో వేషం వేశావా ?

మూర్తి : ఓ. ఒకటేమిటోయ్ ? అన్నీ చూశాను. 1943 లో నాట్యకళాపరిషత్తులో చిట్టా ఆంజనేయమ్మ అనే అమ్మాయిని నా చేతుల్తో ట్రైనింగు ఇచ్చి పంపించాను. ఆవిడ ఇప్పుడు famous cine actress చిత్తరంజనీదేవి అయి కూర్చుంది. .... ఎందు కడిగావ్ ?

శంకరం : ఆఁ ఏంలేదు. ఇందాకా నీ మాటలు చూస్తూంటే - ఎప్పుడైనా నాటకాలు వేసే వాడివేమో అనిపించింది .... ఆ మాటలు చెబుతూన్నంతసేపు పైనుంచి క్రిందకీ, క్రిందనుంచి పైకి మువ్‌మెంటు ఇచ్చావా, స్టేజిమీద లాగ ?

మూర్తి : అల్లా ఎందుకోయ్ : నేను రేడియో ఏక్టర్ని తెలుసా. కదలకుండా - మెదలకుండా ఏక్షన్ చేయగలను ... హైదరాబాదు రేడియోలో నేను ఏక్టుచేస్తూంటే ఎప్పుడూ వినలేదూ ? You haven't seen life, then, brother, you have missed much ! హైదరాబాదు రేడియోలో - మాట్లాడితే మన్ని పిలుస్తూంటారు !

శంకరం : ఎవరు మాట్లాడితే నిన్ను పిలుస్తూంటారు ?

మూర్తి : అనవోయ్, బ్రదర్, అను. నువ్వు కూడా మొదలెట్టు.

శంకరం : కోపం తెచ్చుకోకోయ్, మూర్తీ. ఊరికే అన్నాను. ఇందాకా నువ్వు తాడిచెట్టు అంటే నేను కోపం తెచ్చుకున్నానా...ఊఁ ఇంక చదువు ప్రారంభిద్దామా ? లేకపోతే – ఈవాళకి కట్టి పెట్టేద్దామా ?

మూర్తి : అబ్బెబ్బే ! అలా ఎలా చేస్తామోయ్ ? ఇందాకా ఎక్కడి వరకూ వచ్చాం ?

శంకరం : ఎక్కడవరకు వచ్చాం ? హేలమ్ చచ్చిపోయాడు. టెన్నిసన్ పద్యాలు రాశాడు వాడిమీద. ఇంకా ఆ పద్యాలు ఏమిటో చదవలేదు మనం.

మూర్తి : చదువుదాం. చదువుదాం. చదవకుండా పరీక్ష కెల్లా వెడతాం ? నువ్వు చదువుతావా ? నేను చదవనా ?

శంకరం : నువ్వు చదువు ; నేను వింటాను.

మూర్తి : పోనీ – నువ్వే చదువు.

శంకరం : నువ్వు చదవ్వోయ్ – ఫరవాలేదు.

మూర్తి : అం–టా–వా ? ఐతే – సరే. Arthur Hallam died in 1833 - died in 1833 - 1833 టోయ్ హేలమ్ చచ్చి పోయింది. జ్ఞాపకం ఉంచుకోవోయ్, శంకరం. Arthur Hallam died in 1833 and Alfred Tennyson... హేలమ్ స్పెల్లింగు చెప్పు – H-A-L-L-A-M – వెధవ్వి

గుర్తుండి ఏడవ్వోయ్ ఇవి – Alfred Tennyson wrote In Memoriam to mourn the death of his beloved friend - To mourn the DEATH - To mourn the death of his beloved friend......

[ పక్కింట్లో పిల్లాడు కేరుమని ఏడుపు. ఏడుపు fade out అయ్యేసరికి ఒక అమ్మాయి ' ఏరువాకా సాగాలంటే ... ' అంటూ అపశ్రుతులతో పాట. అది పూర్తి అయ్యేసరికి పక్కింటి కుర్రాడి హిస్టరీ పాఠం. ]

పక్కింటి కుర్రాడు : హెన్రీ ది ఎయిత్ తర్వాత హెన్రీ ది నైన్త్ రాజ్యమునకు వచ్చెను. ఇతడు అప్రయోజకుడే కాని మంచివాడు. ఇతని మంచితనమే చివరకు కొంప తీసెను ... చివరకు ఇతని కొంప మునిగెను...ఇతని రాజప్రాసాదము మునిగెను...ఇతడు దుర్మార్గుడైనచో, ఇతడు దుష్టుడైనచో ఇతడు దుందుభి, దుర్ముఖి, రుధిరోద్గారి అయినచో ఇతని కొంప మునిగెడిది కాదు. కాని పాపం .... పాపం ... [ ఇక్కడ అమ్మాయి విచారసూచకంగా చప్పుళ్ళు చేస్తుంది ] మంచివాడగుటవల్లనే ఇతని రాజప్రాసాదము గంగలో మునిగినది.

[ ఇది నెమ్మది నెమ్మదిగా fade out అయిపోతుంది ]

మూర్తి : చూశావా, శంకరం ? నువ్వే చూశావుగా ? పగలంతా స్కూల్లో పడిపడి వస్తాం. ఏదో పైకిపోవాలన్న అభిలాష ఉంది కాబట్టి నెత్తురోడ్చి సంపాదించిన డబ్బుతో పరీక్షలకు కడతాం. ఏమిటి ఫలితం ? స్కూల్లో హెడ్‌మాస్టరు దగ్గర నుంచి కుర్రచప్రాసీ వరకు అందరికీ ఈర్ష్యే ! మొన్న సుబ్బారావేమన్నాడో తెలుసా ?

శంకరం : ఏ సుబ్బారావు ? ఇంటర్ ట్రెయిన్డా ?

మూర్తి : కాదోయ్ మేథ్స్ గ్రేడ్యుయేటు. కుర్రాళ్ళు ' చేగోడీ ' అనీ పిలుస్తారూ ? వాడు. వాడొచ్చాడు మొన్న నా దగ్గరకి. ' M. A. కి కడ్తేవుటగా ? ' అన్నాడు. ఒక నిముషం ఉండి, మొహం అదోలా పెట్టి, 'మంచిదే' అన్నాడు సాగతీసు కుంటూ. మరో నిముషం ఆగి, 'ఎందుకోయి? డబ్బు తగలెట్టు కోడం కాని మనం పేసయి ఏడుస్తామా ?' అన్నాడు. నాకు వళ్ళు మండుకొచ్చింది, ఒక నిముషం ఆగి నేనన్నాను : 'సుబ్బారావు, మా ఆవిడ ఇంట్లో ఈవాళ చేగోడీలు చేసింది. తింటావా ? బాగున్నాయి' అన్నాను. వాడి మొహం కంద గడ్డలా అయిపోయింది. 'థేంక్యూ వెరీమచ్ బట్ నో' అని 'వెళ్ళొస్తా' అని చెప్పి చరచరా వెళ్ళిపోయాడు.

శంకరం : మంచిపని చేశావోయ్ ! లేకపోతే – వాడి మొహం ! – వాడెప్పుడూ అంతే !

మూర్తి : ఇంట్లోవాళ్ళ పరిస్థితి చూస్తే ఇల్లా ఉంది. ఎంతని చావా లోయి ? వళ్లు మండుకొస్తూంది .... [ గట్టిగా ] నేను తాచుపాములాంటి వాణ్ణి. నాకు అపకారం చేసినవాడు సర్వ నాశన మవుతాడు. నేను దూరదూరంగా పోతాను. చిన్న చిన్న చిరాకులన్నీ ధర్మరాజులా సహిస్తాను. కాని నా సహ నానికి అంతు ఉంది. [ నెమ్మదిగా ] ఎలా ఉంది ?

శంకరం : బాగానే ఉందికాని ఏమిటి నీ ఉద్దేశ్యం?.

మూర్తి : కంగారు పడకు. ఒక నిముషం ఉండి చెబుతాను. [ గట్టిగా ] నా హృదయం అగ్నిపర్వతం లాంటిది. బ్రద్దలైందా – లావా

ద్రవం - ఉడుకుతూన్న లావాద్రవం వెల్లువలై పారుతుంది- అడ్డొచ్చినవాడు ప్రతీవాడు - సరిమానవు డన్న వాడు - ఆ అగ్నిప్రవాహానికి ఆహుతైపోతాడు. [ నెమ్మదిగా ] ఆ పక్కింటి వెధవలేడూ ? వాడు గుమ్మంలో నుంచుని వింటు న్నాడు. అదీ సంగతి. [ గట్టిగా ] నా మంచితనం చూసి, నా సహృదయత్వం చూసి - నేను బలహీనుణ్ణి అనుకున్న వాళ్లున్నారు. వాళ్ళు నాకు అపకారం చేద్దామని చూస్తున్నారు. వాళ్ళెవరో నాకు తెలుసు. నా ఓర్పుకు మించిపోయిన రోజున నా కాలి చెప్పుక్రింద రాచి పారేస్తాను. శివుడి మూడవకన్ను తెరిస్తే భస్మమయిన మన్మధుడిలా భస్మమయి పోతారు వాళ్ళు.

శంకరం : అది సరేకాని, మూర్తీ : ఈ వాళకి చదువు కట్టి పెట్టేద్దామా ?

మూర్తి : అబ్బెబ్బే ! అదెలా కుదురుతుంది ? పరీక్షలు పదిహేను రోజులు కూడా లేవే ? మనం ఎంత వరకు వచ్చాం ?

శంకరం : ఎంతవరకు వచ్చామా ? హేలమ్ 1833 లో చచ్చిపోయాడు. చచ్చిపోయిన తర్వాత టెన్నిసన్ పుస్తకం రాశాడు. అతడా పుస్తకం రాయడానికి పదిహేను సంవత్సరాలు తీసుకున్నాడు. అది రాసి నూరు సంవత్సరాలయింది. మూడు సంవత్సరా లుగా అది M. A. కి టెక్స్టు బుక్‌గా పెట్టేరు. మనం క్రితం సంవత్సరం M. A. పరీక్షకు కూర్చుని fail అయ్యాం. ఈ సంవత్సరం కలిసి పరీక్షకు చదువుదామనుకుని ప్రారంభించాం. నీ ఉపన్యాసం ప్రారంభించే సరికి - పరీక్షలు పదిహేను రోజు లున్నాయి. ఇప్పుడెంత కాలముందో - కేలండరు చూస్తేగాని

చెప్పలేను...వస్తాను, బ్రదర్. తరవాత ఎప్పుడైనా ప్రారంభిద్దాం. ఈవాళ మంచి రోజు కాదల్లే ఉంది.

[ 5, 6 సెకనుల నిశ్శబ్దం ]

లలిత : మీ స్నేహితుడికి కోపం వచ్చి వెళ్లిపోయినట్టున్నాడే!

మూర్తి : వెళ్ళిపోయాడు. అతన్ని మాత్రం అని లాభమేమిటి చెప్పు. వచ్చినప్పటి నుంచీ ఒకటే గొడవ అయ్యె. అతనికీ విసుగు పుట్టింది...చూడు, రెండాకులు చుట్టిస్తావా?

లలిత ; అయ్యో! ఇప్పుడేం తమలపాకులండీ - ఇంకా భోజనం చెయ్యకుండానే?

మూర్తి : లేదు. నాచదువు ప్రారంభిస్తున్నాను. పాన్ వేసుకు ప్రారంభిస్తాను. ప్రారంభించిన తర్వాత బండి వెళ్లిపోవలసిందే - ఇక ఆగదు. అటు సూర్యుండిటు ఉదయించనిమ్ము. "నిటలాక్షుం డిపు డెత్తివచ్చినను రానీ". హుం. 'నినద భీషణ శంఖము దేవదత్తమే!'

లలిత : ఆఁ మీరు చదవకేం? మీ సంగతి నాకు తెలియదూ?

మూర్తి : ఎంత మాటంటివే - రాణీ! అయిన పరికింతువు గాక! ఇదే ప్రారంభించెదను.

శ్రీహరి : చదువుకుంటున్నావా, నాన్నా!

మూర్తి : అవునురా, పుత్రమా! నీకేమి వలయునురా? - పానకమందలి పుడకపలె ప్రవేశించితివి?

శ్రీహరి : అబ్బే! 'చదువుతా! చదువుతా' అంటావుగాని-నువ్వెప్పుడూ చదవవు నాన్నా!

మూర్తి : అహో ! చంద్రమతీ ! లోహితాస్యుడు కూడ నన్ను పరిహసించుచున్నాడే ! ఇదే - చదువు ప్రారంభించుచున్నాడ !...
[గట్టిగా] Arthur Hallam died in 1833-H-A-L-L-A-M-Arthur Hallam died in 1833 and ... why did he die ? ఎందుకు చచ్చాడు వాడు ? చెప్పలేదు. ఏం జబ్బో చెప్పలేదు. బహుశః పరీక్షలో అది లేదేమో ? Hallam చచ్చిపోతే Tennyson ఏంచేశాడు ? Tennyson wrote a poem.

[ పక్కింటి పిల్లాడు కేరుమని ఏడుపు ]

[ఇంకా గట్టిగా] Tennyson wrote a poem called 'In Memoriam'. వాడు ఎందుకు రాశాడు ? To mourn the death of his friend.

[ 'ఏరువాకా సాగాలంటే...' అంటూ పక్కింటి అమ్మాయి పాట ]

[అరుస్తూ] To mourn the death of his friend - his beloved friend.

లలిత : ఏమండోయి !

మూర్తి : [గట్టిగా] అంటే ఏమిటి అర్థం ? Tennyson mourned the death of his friend by writing a poem - T-E-N-N-Y-S-O-N- టెన్నిసన్ - ఈ స్పెల్లింగుతో న్యూసెన్సు.

లలిత : [అరుస్తూ] ఏమండోయ్, భోజనానికి రావచ్చు.

[ ఇక్కడ ఒకేసారి వెనకాల background లో కేరుమన్న కుర్రాడి ఏడుపు; 'ఏరువాకా' పాట; హిస్టరీ పాఠం...

ముందు మూర్తి పాఠం, లలిత గొంతు ఒకేసారి విన పడతాయి.

రైలు కూత - రైలు వచ్చి వెళ్లిన చప్పుడు - పది, పదిహేను సెకనులు గడిచిపోతాయి]

మూర్తి : అబ్బబ్బ ! ఇంకా నాకు చదువేమిటి ? స్కూల్లో గొడవ. ఇంట్లో గొడవ. బయట పాటలుపాడేవాళ్ళు. ఇంట్లో భోజ నానికి పిలిచేవాళ్ళు. ఇవన్నీ చాలక వచ్చేపోయే రైళ్ళు.

లలిత : ఏమిటండీ ! మరీ ఇదిగా మాట్లాడతారు ? చదువుకోవాలని కోరికే ఉంటే - బయట గొడవ లెందుకు వినపడతాయి ? చెవులు మూసుకొని, చదువుకోవచ్చు.

మూర్తి : అం-తా-వా ? ఐతే - సరే.

[మూర్తి చెవులు మూసుకుంటాడు. మూర్తి 'హీరో' కాబట్టి మూర్తి చెవులు మూసుకోగానే, శబ్దాలన్నీ మూర్తికి వినపడ్డట్టుగానే - శ్రోతలకు కూడా వినపడాలి. అంటే చాలా తక్కువస్థాయిలో వినబడతాయి.]

లలిత : భోజనానికి వస్తారా ?

మూర్తి : ఆఁ ? ఏమిటంటావ్ ?

లలిత : అదేమిటండీ? చెవులతోపాటు, కళ్ళు కూడా మూసుకుంటారు?

మూర్తి : నువ్వేమన్నావో నాకు వినపడ్డం లేదు.

లలిత : [విసుగ్గా] చెవులమీద చేతులు తియ్యండి. వినపడుతుంది.

మూర్తి : చెప్పులమీద చీమ లెక్కాయా ? కాలికిందపడి నలిగిపోతాయి. అంతే శాస్త్రి ! [కొంచెం గట్టిగా] అంతే శాస్త్రి ! ! నాకు అప

కారం చేద్దామన్న దుర్బుద్ధికల వాళ్ళందరను-ఇలా _ ఇలా _ కాలిని పట్టి రాసేస్తాను. దేనికైనా సమయం రావాలి !

లలిత : భోజనానికి సమయం వచ్చింది.

మూర్తి : ఏమి టంటావ్ ?

లలిత : ఏ మంటానా ? ఏ మంటానా ? ఇలా చేతులు తీసి [చేతులు పక్కన పెడుతుంది. లలితకంఠంతోబాటు అన్ని శబ్దాలు గట్టిగా వినపడ్డం ప్రారంభిస్తాయి.] అలా పక్కన పెట్టుకోండి. ఇప్పుడు చెప్పండి...భోజనానికి వస్తారా ?

మూర్తి : ఆ ! వస్తాను. వస్తాను. ఇంకేముంది - మనంచేసే పని- కాస్త తినడం, పడుకోడం....[రాగం ఎత్తుకుంటాడు] ఇంతేనా ? ఈ బ్రతుకు ఇంతేనా ? [వెనకాల మ్యూజిక్. హఠాత్తుగా చెంబులు, గిన్నెలు పడిన చప్పుళ్లు. ఈ చప్పుళ్ళు వెనకాల వినపడుతూనే ఉంటాయి. పాట ఆగిపోతుంది. Announcement ప్రారంభం.]

[ 1956 ]

# 'అప్పిచ్చువాడు'
# వైద్యుడు..!

## 8

"అప్పిచ్చువాడు వైద్యుడు" – అన్నవాడెవడో పిచ్చివాడని నా అభిప్రాయం. ఆపిచ్చివాడు ఈ మాటలు "సుమతి" అన్న అమ్మాయితో చెప్పాడని మా తెలుగు మాష్టారు ఎప్పుడో ఒకసారి చెప్పినట్టు జ్ఞాపకం. ఆయన ఓ పాతకాలం మనిషి. ఆ అమ్మాయి పేరు 'సుమతి' అని ఎవరో చెబితే, నమ్మేసుంటాడు. పరాయి ఆడవాళ్లను గురించి అప్పుడప్పుడు తప్ప ఆలోచించడం తప్పని ఆయన ఉద్దేశ్యం కూడా. ఆ అమ్మాయి పేరు సుమతి అయి యుండదు.

ఆ బుద్ధిమంతురాలి పేరు లలితో, మాణిక్యమో, తవ్వమ్మో, సుబ్బాయమ్మో, అయ్యుండచ్చు. తన ముందు నిలబడి, ఊపిరి బిగబట్టి, వరసగా నూరు పద్యాలు చెప్పేసిన వెర్రి పెద్దమనిషితో తనపేరు 'సు–మతి' అని ఆమె చెప్పి ఉండవచ్చు. అతగాడు మతి–హీనుడని నొక్కి చెప్పడం కోసం.

పిచ్చివాళ్లలో కూడా రకాలుంటాయ్. కొందరు పిచ్చివాళ్ళు నెలలో కొన్ని రోజులు మాత్రమే పిచ్చిగా ఉంటారు. కొందరికి పౌర్ణమి,

అమావాస్యకి మాత్రమే పిచ్చెక్కడం నే నెరుగుదును. అది సమంజస మైన పద్ధతి. ఐతే - మరి కొందరు మతిహీను లున్నారు. వాళ్లు నెలంతా పిచ్చి పిచ్చిగానే ప్రవర్తించి పౌర్ణమి అమావాస్య రోజుల్లో తక్కిన మంచివాళ్ళై కూచుంటారు. మా ఇంటి పక్కనే ఇటువంటాయన ఒకాయ నున్నాడు. నేను అమావాస్య రోజున సరిగ్గా తిథి చూసుకొని ఆయనదగ్గర కెళ్లి, "ఏమిటి బాబాయ్? నువ్వు పిచ్చాడివో వెర్రాడివో తెలియడంలేదు. నెలంతా పిచ్చాడివిగా ఉండి, అమావాస్య నాడు మంచిగా ఉంటావ్? ఇది లోక విరుద్ధమైన వ్యవహారం" అంటాను. "అదేమిటి, బాబాయ్, నువ్వుకూడా అలా అంటావ్" అంటాడు నన్ను కౌగలించుకు ఏడుస్తూ. ఒక మంచిపని చేశానన్న గర్వంతో ఇంటికి తిరిగి వస్తూంటాను.

ఒకసారి కేలండర్లో తిథి తప్పుపడింది. పాడ్యమినాడు పొద్దున్నే వెళ్ళి, తాపీగా కూచొని, అదేమాట అన్నా. వచ్చి వాడు నన్ను కౌగలించుకు ఏడవడం కోసం ఒళ్ళు సరిచేసుకు కూచున్నా. వాడు హనుమంతుడిలా ఎగసి గెంతేసి, హిరణ్యాకశిపుడిలా వికటాట్టహాసం చేసి, మహిసాసురమర్దనిలా నా జుట్టు పట్టుకుని, మాఊరి డాక్టరుగారు ఇంజక్షను ఇచ్చినట్టు నాఒళ్ళు హూనం చేశాడు. ఇంటి కెళ్ళి, స్పృహ వచ్చినతర్వాత, గంటల పంచాంగం చూద్దును గదా - అమావాస్య వెళ్ళి పోయి ఆరు ఘడియలైంది.

అందువల్ల పిచ్చివాళ్ళందరూ ఎప్పుడూ పిచ్చివాళ్ళే ననుకోడానికి వీల్లేదు. కొందరు పిచ్చివా ళ్లుంటారు. పైకి - మంచిగానే కనిపిస్తారు. 'కవిత్వం' రాస్తారు. ఐనా - ఫరవాలేదు. వాళ్లు రాసింది కవిత్వమే నంటారు! ఐనా - ఫరవాలేదు. వాళ్లు రాసిన కావ్యాల్ని ఆవిష్కరించ డానికి మంత్రుల్ని క్యూలో నిలబెట్టి పిలుస్తారు. ఐనా - ఫరవాలేదు.

ఈ కావ్యాలు పాఠశాలల్లో పాఠ్యగ్రంథాలుగా వస్తాయ్. ఇదికూడా ఫర వాలేదు. " మేము ఫలానా పద్యంలో చెప్పింది పరమసత్యం సుమా?—" అంటూ, అక్కడా ఇక్కడా ఇలా ప్రచారం ప్రారంభిస్తారు. అక్కడే వస్తుంది తంటా అంతా.

నేనుకూడా ఇటువంటి పిచ్చిపనులు అప్పుడప్పుడు చేస్తూనే ఉంటాను. కాని వెర్రి కొంచెం వెలిసిన తర్వాత, ఎవరెవరితో అలా అన్నానో వాళ్ళందరి దగ్గరికీ వెళ్ళి, "నే నిదివరకు చెప్పిందంతా నిజమే కాకుండా, అబద్ధం కూడాను" అని చెప్పి చక్కా వస్తా. (నే నీ వ్యాసం రాయడం ఏదో వెర్రి అనుకోండి. అనుకోండి. అది రూఢి కాగానే నాకు మళ్ళీ నేనే ఇదంతా అబద్ధమని రాసేస్తా! చాలా? థేంక్యూ).

సుమతీమతల్లి పేరిట నూరు పద్యాలు రాసి, పుస్తకం అచ్చు గుద్దించుకున్న పెద్దమనిషి, ఏదో తంటాలుపడి అది పాఠశాలల్లో పాఠ్య గ్రంథంగా నిర్ణయించుకున్నాట్ట. ఇది చాలక, తను పద్యాల్లో రాసిందంతా పరమసత్య మని ఇక్కడా అక్కడా ఇలా అంటున్నా డని వినికిడి. ఎవరైనాసరే. నమ్మేయగల్రు కూడా.

మీకు డాక్టర్లతో పెద్ద పరిచయం ఉందో లేదో తెలియదు. నాకూ డాక్టర్లకీ బాల్యస్నేహం. నే నంటే డాక్టర్లకి అమితమైన వాత్సల్యం. రోగం లేకుండా మం దిమ్మనమంటే ఇస్తారు. మందు లేని రోగం తెప్పించమంటే తెప్పిస్తారు. ఫీజు తీసుకోకుండా రోగం తెప్పించమంటే తెప్పిస్తారు. ఒకసారి ఓ డాక్టరుగారు నాకు మామూలుజ్వరానికి మందిచ్చి మలేరియా చేసి, టైఫాయిడ్‌లోకి దింపి. ఇన్ఫ్లూయంజా కూడా రంగరించి ఇచ్చాడు. తీరా ఆయన ఇంకో పేషెంటుకి మందు ఇస్తూ న్నప్పుడు నా రోగం తగ్గిపోయింది. ఫీజు టోకుగా తీసుకోమంటే, ససేమిరా కాదన్నాడు. 'మరొహరు మరొహరూ ఐతే తీసుకునేవాణ్ణి.

నా మందువల్లే మీకు టైఫాయిడూ, ఇన్ఫ్లూయంజా వచ్చినమాట నిజమే కాని మలేరియా నావల్ల రాలేదు. అందువల్ల అలా ఫీజు తీసుకోడం న్యాయం కాదు' అన్నాడు సిగ్గుపడుతూ. స్టెతోస్కోపు చివర మెలిపెట్టి బల్లమీద రాస్తూ నిలబడ్డాడు.

నేను బలవంత పెట్టి డబ్బు ఇచ్చేశాను. ఇక చేసేదిలేక డబ్బు తీసుకొని, "మీ కెప్పుడైనా తీరిక ఉన్నప్పుడు రండి. ఊరికే ఆపరేషన్ చేస్తాను" అన్నాడు. మరో డాక్టరుగారు చచ్చిపోతూ—డాక్టర్లు కూడా చచ్చిపోతుంటారు, అప్పుడప్పుడు!—విల్లు రాసి, సగం డబ్బు నాకు విడిచి పెట్టాడు. ఆయన ఆస్థిలో ఒక పాతికవంతు నాకు రంగునీళ్లు కలిపి ఇవ్వడంవల్ల వచ్చిందిట. మరో పాతికవంతు ఆ రంగునీళ్ళవల్ల వచ్చిన జబ్బులకి మందుగా రంగునీళ్లు కలపడంవల్ల వచ్చిందిట. ఈ డబ్బు పూర్తయేవరకు నాకు జబ్బులు ఉచితంగా కుదర్చ మని విల్లులో ఆయన రాసి చచ్చిపోయాడు. ఆయన ప్రతీ మాసికానికి నాకో ఇంజక్షను ఊరికే ఇచ్చిపోతానని కూచుంటున్నాడు ఆయన కొడుకు.

డాక్టర్లందరికీ అటువంటి ప్రేమ నేనంటే. ఇటువంటి నాక్కూడా అప్పు లివ్వడానికిగాని, అప్పుగా మందు లివ్వడానికిగాని డాక్టర్లెప్పుడూ అంగీకరించలేదు. ఋణశేషం, రోగిశేషం ఉండకూడ దని డాక్టర్ల సంఘం వాళ్ళ తీర్మానం. ఈ సంఘ సమావేశాల్లో ఏవో చాలా గంభీరమైన తీర్మానాలు చేస్తారని మనం అనుకుంటాం. ఫీజు వెంటనే ఇచ్చే రోగికి తప్ప మం దివ్వద్దనీ, మం దిచ్చిన తర్వాత ఫీజు ఇవ్వడని అనుమానం వేస్తే రోగం ఎక్కువచేసి ఫీజు ఇచ్చిన తర్వాతే తగ్గించమనీ, ఆ తీర్మానాలకి వాళ్ళ భాషలో అర్థమని ఓ డాక్టరు మిత్రుడు చెప్పాడు నాకు.

ఇటువంటి పరిస్థితుల్లో "అప్పిచ్చువాడు" అని రాయడం కవిగారి కేం రోగమో తెలియదు. ఇంకా ఆ పద్యం ఎలా నడుస్తుందో చూడండి.

"ఎప్పుడు నెడతెగక పారును". ఏమైనా అర్థముందా? చేదుమందు చూసి పారిపోయిన కుర్రాళ్ళని చూశాం. ఇంజక్షను సూది కనబడగానే మిల్ఖా సింగుని మించిన వేగంతో పరుగెత్తే పెద్దవాళ్ళను చూశాం. విజిటింగు ఫీజు బల్లమీద పెట్టకుండా, కదిలే డాక్టరును చూశారా ఎక్కడైనా? ఒక పేషెంటు దగ్గర్నుంచి మరో పేషెంటు దగ్గరికి, తిరుపతిక్షౌరం చేసే మంగలిలా, పరుగెడుతుంటా డనా అర్థం?

'నెడ' అంటే అదొక శరీరభాగం అయ్యుండ వచ్చని, శస్త్ర చికిత్స చేసే వైద్యులు ఈ 'నెడ' తెగక బాధపడుతూంటారని, ఎప్పుడూ పారిపోతూంటారని కవిగారి అర్థం అయ్యుండ వచ్చని, ఒక మిత్రుడు సూచించాడు. అదికూడా నేను నమ్మను. ఏ నిఘంటువులోను ఈ 'నెడ' కనబడ్డంలేదు. పైగా-కవిగారు తర్వాత "...ఏరును..." అంటున్నారు. 'ఏరును' అనేముందు గన్నేరు పువ్వులో, మంత్రాలకురాలే చింత కాయలో, మునిసిపల్ బియ్యంలో రాళ్లో, ఏది 'ఏరునో' కవిగారు చెప్పాల్సింది. చెప్పలేదు. పైగా-'ద్విజుడున్' అన్నారు. ద్విజుడంటే రెండు జన్మలు ఎత్తేవాడని అర్థం. డాక్టర్ల చేతుల్లోపడి బ్రతికి వచ్చిన వాళ్ళని 'ద్విజులు' అని వర్ణిస్తే అర్థముంది. కాని డాక్టర్లని 'ద్విజులు' అని వర్ణించడంలో సబబు కనబడదు.

ఒక విధంగా ఈ పద్యానికి అర్థం చెప్పుకోవచ్చు. 'వైద్యుడు' అంటే 'రోగం కుదిర్చేవాడు' అనిగదా మన భావం? పొరపాటే నను కోండి. కాని - మనభావం అదేగదా? "అప్పిచ్చువాడు వైద్యుడు" అంటే "అప్పులాడు మన రోగం కుదురుస్తాడు" అని అర్థం. అప్పు లాళ్ళు మనరోగాలు ఎలా కుదురుస్తారో మరోసారి చూద్దాం. ఈ అర్థం దృష్టిలో పెట్టుకొని పద్యం అవధరించండి. "ఎప్పుడు నెడతెగక పారును". నిజమేమరి. 31 వ తారీఖు ఇంకా సందుమలుపులో ఉందన

గానే కలలో కనపడ్డం ప్రారంభిస్తాడు. 31 వ తేదీ సాయంత్రానికే గుమ్మం మీద వచ్చి కూచుంటాడు. ఒకటో తారీఖు ఆఫీసు మొగలోనే ప్రత్యక్షమౌతాడు. అప్పులు తీసుకున్నవాళ్ళందరికీ ఒకటో తారీఖు ఒకే రోజున తెల్లారుతుంది. అందరి గుమ్మాల్లో పొద్దున్నే కనుపించే అప్పులాడిని గురించి ఆలోచిస్తూ, 'ఎప్పుడు నెగతెగక పారును' అనడంలో ఆశ్చర్యం లేదు. "వీడెక్కడ దొరికాడురా? ప్రాణాలు ఏరేస్తున్నాడు" అన్న దృష్టిలో 'ఏరును' అనడంలో ఆశ్చర్యం లేదు.

కాని - 'ద్విజుడున్' అనగానే వస్తుంది తంటా.

పద్యం ఎటునుంచి ఎటు చదివినా, పూర్తిగా అర్థం కావడం లేదు. ఐతే - నూరు పద్యాలు రాసి, కవిగారు పాఠ్యగ్రంథం చేసుకున్నాడు. పాఠ్యగ్రంథాల్లో అచ్చుతప్పు లుండడం అలవాటేగదా? అందువల్ల - 'అప్పిచ్చువాడు వైద్యుడు ....' అని ఉండాలేమో ననిపిస్తుంది. 'ఎప్పుడు నెడతెగక' పరుగెత్తే వైద్యుడు పిచ్చివాడు కాక మంచివాడా? పిచ్చివాళ్లు కనబడ్డ వన్నీ 'ఏరి' మెళ్ళో దండ గుచ్చుకు వేసుకోడంలో ఆశ్చర్యం లేదు. 'అ ప్పిచ్చివాడు' [అ + పిచ్చివాడు, త్రికసంధి] ద్విజు డనుకున్నా ఫరవా లేదు, వెర్రి బ్రాహ్మ డన్నట్టు.

అచ్చు తప్పని సరిపెట్టుకుందా మనుకుంటే - మరో తంటా వచ్చి పడింది. ఈ పద్యం గమనించండి. "అక్కరకు రాని చుట్టము...." ఈ అక్కరకు రాని చుట్టము ఎవరో చెప్పలేదు. "(అతడు) మ్రొక్కిన వరమీని వేల్పు" మనకు ఇంతమంది దేవుళ్ళు ఉన్నారు. ఎవరో ఎలా తెలుస్తుంది? "తాను [ఆ వేల్పు] ఎక్కిన బారని గుర్రము గ్రక్కున విడువంగ వలయు...." ఎవరు విడవాల్సింది? ఆవేల్పైతే - మనతో చెప్పడం దేనికి? మనం విడవాలంటే-ఆ చుట్టం ఎవ్వరో, వే ల్పెవ్వరో, గుర్రం ఏదో, ఎక్కడుందో చెప్పక పోతే ఎలా?

అచ్చుతప్పే కనబడ్డం లేదు ఈ పద్యంలో. అందువల్ల ఏ విధంగా ఆలోచించినా, ఈ కవిగారు పిచ్చివా డనే తోస్తూంది. భావంతో, అర్థంతో సంబంధం లేకుండా, పాదపూరణం చేసి పద్యాలు కట్టే కవులు మనకి తక్కువలేరు. అందువల్ల ఈ పిచ్చాయన్ని కవిగా రని పిలిచినా ఫరవా లేదు. రెండు తిట్లకి అర్థంలో తేడా లేదని అంటూనే ఉంటారుగా జనం?

[ 1960 ]

---

## అప్పుల 'డబ్బుల్' రూలు

అప్పు ఇచ్చేవాడు రెండు విషయాలు గుర్తుంచుకుంటాడు. ఒకటి, అప్పు తిరిగి వాపస్‌చేసే వాడికే ఇస్తాడు; రెండు, వాపస్ చేయ డానికి డబ్బున్న వాడికే ఇస్తాడు. అందువల్ల, సాధారణంగా అప్పు కావలసినవాడికి అప్పు దొరకదు. వద్దన్నవాడి గుమ్మంలో ఎప్పుడూ పడిగాపులు గాస్తూ ఉంటుంది డబ్బు.

సూర్యుడు చుట్టూ ఎప్పుడో తిరగడం మానేసింది భూమి! డబ్బు చుట్టూ తిరుగుతూంది ఈ రోజుల్లో! ఇది అబద్ధం అంటారు శాస్త్రజ్ఞులు; నమ్మకండి. వాళ్ళు కూడా ఈ భూమిమీద బ్రతికేవాళ్ళే— వాళ్ళ ఆలోచనలు ఆకాశంలో మెదిలినా! అందువల్ల భూమితోబాటు వాళ్ళు కూడా డబ్బుచుట్టూ తిరుగుతూంటారు.

'రాజధాని కబుర్లు' - 21-1-59

# ఓడిపోయిన పందెం

## 9

పాత్రలు :

నారాయణరావు, అతని ...

| | | |
|---|---|---|
| భార్య | : | సీత |
| కొడుకు | : | రాముడు |
| బావమరది | : | సూర్యం |
| అత్తగారు | : | లక్ష్మమ్మ |

కూలీలు

సీత : రాముడూ ! .... రాముడూ ! ... ఒరేయ్ రాముడూ ! .... వినిపించుకోవేంరా ?

రాము : అబ్బ చంపుతున్నావు ! .... ఏమిటే అస్తమానూ నన్నే పిలుస్తావ్ ? అక్కను పిలు — నేను రాను.

సీత : ఒక్కసారి రారా బాబూ ! బాబ్బాబు, రావుట్రా ? అక్కడ షెల్ఫులో మెంతుల డబ్బాలో ఆవాలున్నాయి తెచ్చిపెట్రా, నాయనా ? . . . లేవలేనురా ! ఊరికే కాళ్లు లాగుతున్నాయి.






రాము : (గారంగా) అవసర మున్నప్పుడు "బాబ్బాబు" అంటావు మన అమ్మే కదా అని నాకు జాలివేస్తుంది. (సీత నవ్వుతుంది) తీరా, పనయిపోయిన తర్వాత "అమ్మా సినిమా కెడతానే !" అంటే "వెధవా ఎప్పుడూ సినీమాలేనా ?" అంటావు.

సీత : నాన్నగార్ని రానీరా ! తప్పకుండా చెప్పి పంపిస్తాను. తొందరగా తెచ్చిపెట్టరా మరి. (గట్టిగా) ఒరేయ్ ! వచ్చేటప్పుడు ఆ కిటికీ తలుపు వేసిరా ! పిల్లొచ్చి పాలన్నీ తగలెడుతుంది.

రాము : (దూరంనుంచి) అమ్మా ! ఆవాలడబ్బాలో మెంతులున్నాయే.

సీత : (గట్టిగా) ఆవాలడబ్బా కాదురా (విసుక్కొంటూ) పీడికేపని చెప్పినా అంతే. (గట్టిగా) మెంతులడబ్బా చూడరా.

రాము : (దూరంనించే) అమ్మా ! మెంతులడబ్బాలోనే . . మెంతుల డబ్బాలో . .

సీత : పట్రారా ఆ డబ్బా ఇల్లాగ !

రాము : (దగ్గరకొచ్చి, గుణుస్తూ, నవ్వుతూ) అదికాదే, మెంతుల డబ్బాలో మెంతులులేవే. ఆవాలు కూడా లేవు . . ఏమున్నాయో తెలుసా ? . . (డబ్బా గలగలలాడిస్తాడు.) డబ్బులున్నాయే. ఇవిగో మూడు రూపాయకాసులు . . మూడు పావలాలూ. (మళ్లీ డబ్బా గలగల లాడిస్తాడు)

సీత : (విసుగ్గా) ఇలా ఇవ్వరా, ఆ డబ్బా.

రాము : నేను సినీమాకి వెళ్ళొద్దులే ? ఒక్క రూపాయియ్యి. ఒక్కటంటే వొక్కటి. — అదిగో విను. (మెగఫోనులోలాగ)

'విశ్వంభరావారి మహత్తర సాంఘిక చిత్రం, చంచలాక్షి. నేడే చూడండి. వెంకట్రావు, గుమ్మడిదల, వేలంగి, జోగేశ్వర్రావు. నాట్యతార కుమారి పద్మ : జంటనగరాలలో ఒకే సారి ప్రదర్శన ప్రారంభం ' ... అమ్మా ఇదిగోనే రెండు రూపాయల ముప్పావలా, .... రూపాయి నాకు.

సీత : నాన్నగార్ని రానియ్యరా : ... నిన్ను సినీమాకి పంపిస్తా నన్నాగా ? తప్పకుండా పంపిస్తాను ... ఆ రూపాయిల్లా పడెయ్యి.

రాము : తీసుకో : . . . ఎవరికి అఖర్లేదు. నేను సినీమా చూడనసలు. అసలు చూడనే చూడను. మీరు వెళ్ళమన్నా వెళ్ళను. నాకో పావలా ఇయ్యి. .... ఐస్ క్రీమ్ కొనుక్కుంటా.

సీత : అదికాదురా : చూడు నాన్నా, ఇటు చూడు (సూర్యం వస్తాడు) ఏమైందిరా సూర్యం ?

సూర్యం : వెదికాను, అక్కయ్యా, వెదికాను. వెదికాను, వెదుకుతున్నాను, వెదకబోతాను. అసలు రహస్యమేమిటో తెలిసే వరకు నిద్రబోను.

రాము : ఆఁ ! అల్లాగే అంటావు. అని, గుర్రెట్టి నిద్రబోతావు.

సీత : ఊరుకోరా, వెధవా ! పెద్దవాళ్లు మాట్లాడుతోంటే మధ్యన అడ్డురాకూ . . . ఆయన అంత ఘోరానికి తలపెడతారని నేను అనుకోను, సూర్యం.

సూర్యం : నీకేం తెలుసు నక్కయ్యా ? నల్లని వన్నీ పాలు, తెల్లనివన్నీ నీళ్ళూ అనుకుంటావ్ ? ఈ మాటు "చపల సుందరి" గెలి

చింది. బావ అల్లా స్నానానికి వెళ్లగా గదినే అంతా గాలించి చూశాను. ఏం కనపడిందంటావ్ ?

సీత : ఏం కనపడింది ?

రాము : ఏం కనపడింది మామయ్యా ?

సూర్యం : బావ పడుకున్న పరుపు దిండుకింద తెల్లకాయితం కనపడింది. దానిమీద ఏవేవో అంకె లున్నాయి. మధ్యలో పెద్ద అక్షరాలతో "చపల సుందరి" అని రాసుంది. దాని కింద ఏముందో తెలుసా ? "ఆంధ్ర ప్రతిభ-౨'' అనుంది. దానికింద "ఎఱ్ఱ గుఱ్ఱం - ౩'' అనుంది. ఈ పేపరు చూడు ! . . . చూడు, ఇదిగో చూడు . . . చూశావా ? బావరాసిన పన్నీ అక్షరాలా నిజమయ్యాయి.

సీత : పేపరు చూసి రాశారేమో ?

సూర్యం : అల్లా కావడానికి అవకాశం లేదక్కయ్యా ! అది నిన్నరాసిన కాయితమల్లేనే ఉంది. నిన్నరాసిన కాయితానికీ, ఈ వేళ రాసిన కాయితానికి తేడా తెలియకపోతే నా అపరాధ పరిశోధన అంతా ఎందు కక్కయ్యా ? దిండుకింద కాయితం పెట్టి, దిండుమీద తలకాయపెట్టి పడుకున్నాడు రాత్రి బావ. దిండుకింద కాయితం నలిగిపోయింది. నలిగిపోయినకాయితం మీద గుండ్రంగా అక్షరాలు రాయి చూద్దాం ! రాయ లేవు ! వెయ్యి రూపాయలు పందెం ! మరి ఈ కాయితం మీద గుండ్రటి అక్షరా లున్నాయి. ఆ కాయితంమీద దస్తూరి బావది. దేర్‌ఫోర్, బావే నిన్ననే ఆ కాయితం రాశాడు.

సీత : అంతా నాకు అయోమయంగా ఉంది, సూర్యం, నాకేమీ అర్థం కావడంలేదు.

సూర్యం : అర్థమౌతుంది, అక్కయ్యా, అర్థమౌతుంది. దేనికైనా కొంత టైం పడుతుంది. జావని ఇంకా పరీక్షించాలి. వెంటనే నేరస్థుడని చేతికి బేడీలు తగిలించకూడదు....

రాము : అమ్మ బాబోయ్! బేడీలే?

సీత : ఉండ్రా, వెధవా! పెద్దవాళ్ళు మాటాడుతుంటే మధ్యన అడ్డు రాకు. బేడీలూ కాదూ, ఏం కాదు.

సూర్యం : నేరం రుజువైన తర్వాతనే మనం తగిన చర్య తీసుకోవాలి. హేమ్లెట్ ఏమన్నాడు?

సీత : వా డెవడురా?

సూర్యం : నీకు తెలియదులే! ఒక గొప్ప ఇంగ్లీషాయన, పినతండ్రిని చంపా లనుకున్నాడు. చంపేశాడు పట్టపగలు.

సీత : హారి వా డిల్లు బంగారం గాను! అదేం పొయ్యేకాలంరా?

రాము : హంతకుడు పట్టుబడ్డాడా, మామయ్యా?

సీత : నువ్వుండరా, మధ్యన.

రాము : నా కా పుస్తకం తెచ్చిపెట్టవ్ మామయ్యా? నాకు డిటెక్టివ్ నవల్లంటే ఇష్టం.

సీత : (గట్టిగా) నువ్వుండరా మధ్యన... ఐతే ఇప్పు డేం చెయ్యా లంటావ్, సూర్యం?

సూర్యం : నువ్వేమీ కంగారు పడకు, అక్కయ్యా! ఇక్కడ సూర్యం ఉన్నాడు, అన్ని విషయాలు చూసుకోడానికి. (గంభీరంగా) నేనేమీ మాటాడను. చూస్తుంటాను. రెండు కళ్ళూ పెట్టుకు చూస్తుంటాను. ఈ వేళ కాకపోతే రేపు బయటపడతాడు, పట్టేస్తాను.

సీత : ఆయన అంత పని చేస్తారంటే నమ్మలేకుండా ఉన్నాను, సూర్యం. రాముడు ఇందాకా "ఒక్క పావలా ఇయ్యమ్మా, ఐస్‌క్రీమ్ కొనుక్కుంటాను" అన్నాడు, "డబ్బుల్లేవురా పోరా!" అన్నాను. కడుపు తరుక్కుపోయింది.

రాము : అమ్మా! ఒక్క పావలా ఇవ్వవే. ఐస్‌క్రీమ్ కొనుక్కుంటాను .... నీ మెంతులడబ్బాలో ఉన్నాయికాదుటే డబ్బులు?

సీత ; (విసుగ్గా) ఉండరా. పెద్దవాళ్ళు మాటాడుతూంటే - మధ్య మాటాడవద్దని ఎన్నిసార్లు చెప్పాను? .... ఒక్కగా నొక్క కొడుకు గదా, సూర్యం, వాడి ముచ్చట తీర్చలేని బతుకు ఏం బతుకు చెప్పు...వాడు సినీమాకి వెడతానే అని అడిగాడు. అసలు వా డెప్పుడూ పేచీ పెట్టడు. పిల్లలిద్దరూ ఆణిముత్యాల్లాంటి పిల్లలు. 'ఇది కావాలి, అది వద్దు' అని ఎన్నడూ మారాం చెయ్యరుకదా? వా డడిగితే సినీమాకు పంపుదామంటే డబ్బు లేకపోయింది చేతుల్లో.

సూర్యం : పోనీ, నా దగ్గరికి పంపలేకపోయావా? ఓ రూపాయి యిచ్చేవాడ్ని.

రాము : మన ఇంటిపక్క టాకీసులో మంచి సినీమా వచ్చింది మామయ్యా. విశ్వంభరా వారి చంచలాక్షి....

సీత : ఒరేయి, ఎన్ని సార్లు చెప్పానురా మధ్యలో కలగచేసుకు మాట్లాడవద్దని ?

రాము : అది కాదే, మామయ్య నడిగితే డబ్బులు...

సూర్యం : ఒరేయి. వేళాపాళా లేదూ సినీమాలకి ? కాసేపు నిశ్శబ్దంగా ఉండు. ఇటుచూడు. అక్కయ్యా ఐడియా, బావస్తాడు, రాగానే "ఒక్క రూపాయుంటే ఇవ్వండి, రాముడు సినిమాకు పోతా నంటున్నాడు !" అను. డబ్బు లే దంటాడు. డబ్బు లేకుంటే ఎల్లాగండీ ? ఎల్లాగో అల్లాగ సంపాయించాలి కాని" అను. అన్యాయంగా సంపాదించ మంటావా ? అని కోప్పడతాడు. "అన్యాయంగా సంపాయించాలా ఏమిటి? గుర్రంపప్పందేల్లో వేసి ఎంతమంది డబ్బు సంపాయించల్లేదు ?" అను దాంతో తా ! మొహం తెల్లబడిపోతుంది.

రాము : తెల్లబడకపోతే ?

సూర్యం : ఎందుకు తెల్లపడదురా ? వెయ్యి రూపాయల పందెం.

రాము : అనవసరంగా పందెం వెయ్యకు, వోడిపోగలవు.

సూర్యం : ఓడిపోయిన పందేలు మా ఇంటా వంటా లేవు తెలుసా ? ఎందుకు తెల్లబడదురా ? చచ్చినట్లు తెల్లపడుతుంది.

సీత : అల్లా అనకు, సూర్యం. ఆయన స్వతహాగా చాలా మంచి వారు.

సూర్యం : మంచివాడు కనక అయితే మొహం తెల్లబడి తీరాలి, అక్కయ్యా. అయినా—

సీత : ఆఁ మంచి వారేమిటి, పోనిద్దూ, మంచివారయితే ఇటువంటి పని చేస్తారా ?

సూర్యం : బాగా చెప్పావక్కయ్యా! కరెక్టుగా చెప్పావు! ఎర్రగుర్రం ఫస్టొస్తుందని ఊరంతా కోడై కూసింది. నాదగ్గరో ఐదురూపాయలుంటే దాని మీద పెట్టాను. అది మూడోదిగా వచ్చింది. పోనీ తనకు తెలుసుగదా? 'ఒరేయి సూరీ! చపలసుందరికే ఛాన్సెక్కువుంది' అని నాతో చెబితే ఏమైంది చెప్పు ? ఏదో నాలుగు రాళ్ళు సంపాదించుకొనేవాణ్ణిగా ?

సీత : ఆయన సహజంగా చాలా మంచివారు, సూర్యం !

సూర్యం : మంచివాడేనమ్మా ! మంచివాడే ! రూపాయికి పదహారణాలు మంచివాడు. కాని ఆయన మంచితనంవల్ల మనకు ఒరిగిం దేమిటి చెప్పు ? పిల్లాణ్ణి సినీమాకి పంపిద్దామంటే డబ్బుల్లేవు కదా ?

రాము : మామయ్యా ! చంచలాక్షి చాలా బాగుందిట, మామయ్యా. వేలంగిటా, అమ్మా వేలంగి ఏం ? (నవ్వుతాడు) వేలంగి రెండు లడ్డూలు తీసుకొని ... రెండు లడ్డూలు తీసుకొని... (పక పకా నవ్వుతాడు).

సీత : పెద్దవాళ్లు మాటాడుతోంటే. మధ్యన మాటాడ వద్దని ఎన్ని సార్లు చెప్పాను రా నీకు ?

సూర్యం : ఆఫీసులో ఇచ్చే వెధవ ఎనభై రూపాయలు చాలక బాధ పడుతున్నాడు .......... గుర్రం నెగ్గుతుంది తప్పకుండా అని తెలిసినప్పుడు ఇంతో అంతో పందెం వెయ్యలేదంటావా?

వేస్తే నెగ్గిన గుర్రంమీద ఏవో డబ్బులు వచ్చే వుంటాయి. ఆ డబ్బేం చేశాడంటావ్ ? ఎవత్తెకో పెట్టే ఉంటాడు. లేక పోతే వేలకువేలు ఎలా ఖర్చవుతున్నాయంటావ్ ?

సీత : ఇదంతా నా ఖర్మ సూర్యం, నువ్వేమన్నా అను. నాన్నగారు బతికుంటే ఇలా అయేదా ?

సూర్యం : చచ్చిపోయిన నాన్నగారి సంగతి దేనికి ? అమ్మ ఊళ్ళో ఉంటే ఇలా అొతుందా ? అమ్మ పేంబెత్తం తీసుకొనే సరికి నాన్నగారే మంచంకింద దూరి కూచునేవారు.

సీత : పోనీ, అమ్మని రమ్మని టెలిగ్రాం ఇస్తేనో ?

సూర్యం : అమ్మదాకా ఎందుకు ? నేను లేనూ ఇక్కడ ? రానీ చెబు తాను. కడిగి కడిగి విడిచి పెడతాను.

సీత : ఆయన మనసు, మంచిమనసు. సూర్యం. నువ్వేమీ అనకు. మనసు కష్టపెట్టుకుంటారు.

సూర్యం : కష్టపెట్టుకొంటే కష్టపెట్టుకోనీ. ఇదంతా తన మంచికోసమేగా ?

రాము : అరుగో నాన్నగారు. నాన్నా, నాన్నా ! ఓడియన్‌లోనే, మంచిసినీమా వచ్చింది నాన్నా.......

నారాయణరావు: నువ్వుండరా బాబు !...ఏమిటి, సూర్యం, ఎవరిని జడి, పిస్తున్నావ్ ?

సూర్యం : అది కాదు, బావా ! అది కాదు. ఏం లేదు...రాముడు సినీమాకి పెడతా నన్నాడు.

నారా : కడిగి కడిగి విడిచి పెడతా నంటున్నావ్, రాముణ్ణేనా ?

సూర్యం : అబ్బే! నేను అనలేదే! అన్నానా? అలా ఎలా అంటాను? అసలు అల్లా ఎందు కంటాను?

నారా : మరే మంటున్నావ్?

సూర్యం : ఏవో కాలేజీ విషయాలు మా అక్కయ్యతో చెబుతున్నాను.... రాముడు సినీమా కెడతా నన్నాడు...డబ్బులు....

నారా : ఇచ్చావా? నువ్వెందుకు ఇచ్చావోయ్, సూర్యం?

సూర్యం : అబ్బే! నే నెలా ఇస్తానూ? ఇవ్వందే? మన దగ్గిర అసలు డబ్బు లుంటేగా ఇవ్వడానికి?

నారా : మరి, కాలేజీ సంగతేమిటి?

సీత : మీ కెందుకండీ వాడి కాలేజీ సంగతి? ఆఫీసులో పని చేసి, పని చేసి వచ్చారా – కాసేపు విశ్రాంతి తీసుకోకూడదూ?

రాము: నాన్నా, సినీమాకి వెడదాం, నాన్నా! మంచి సినీమా .... నవ్వొస్తూ ఉంటుందిట.

నారా : సినీమాకి రేపో, ఎల్లుండో వెడదాం రా బాబూ. నా దగ్గిర ఇప్పుడు డబ్బుల్లేవు.

సీత : పాపం వాడేదో ముచ్చటపడి అడుగుతూంటే, పోనీ తీసు కెళ్ళకూడదుటండీ?

సూర్యం : పోనీ, నాతో రారా, రాముడూ, నేను తీసుకెడతాను.

నారా : ఇప్పుడే గాదుటోయ్ డబ్బుల్లేవన్నావ్, నీ దగ్గర?

సూర్యం : డబ్బుల్లేకపోతే మాత్రం? ఎల్లాగో అల్లాగ చూద్దాంలే!

నారా : డబ్బుల్లేని వాళ్లకి ఎల్లాగో అల్లాగ చూపిస్తారా? సినిమావాళ్లు ?

సీత : వాడేదో అన్నాడు వాణ్ణి పట్టుకు పేళాకోళం చేస్తా రెందుకు మీరు ? డబ్బుంటే కుర్రవాణ్ణి సినిమాకు తీసుకెళ్ళండి. లేక పోతే మానేయండి.... ఊళ్లో అందరి మీద ఖర్చుపెట్టడానికి ఉంటుంది డబ్బు.

నారా : ఊళ్లో ఎవరిమీద ఖర్చుపెట్టానే ?

సీత : ఎవరిమీద ఖర్చు పెట్టారో తెలుసులెండి, అంతా తెలిసి పోయింది. సంపాయించిన డబ్బంతా ఎటుపోతూందో అంతా తెలిసింది.

నారా : ఎటు పోతూందిట ? ఫర్ ఎక్జాంపుల్, చెప్పు చూద్దాం.

సీత : మీకు సిగ్గులేకపోతే నాకైనా ఉండొద్దూ ?... ఇక్కడ కాదు. ఇంకా పదిమందిలో పెట్టి అడగండి !

నారా : ఇప్పు డిక్కడ ఎవ రున్నారే? ఒహాడు కొడుకు, మరొహాడు తమ్ముడు. ఇద్దరికీ మెదడులేదని ఎన్నడో తేలిపోయింది. ఒకటోతారీఖు సాయంత్రం ఎనభై రూపాయలు అణాపైసల తో అమ్మగారి చేతుల్లో పోస్తున్నానని వాళ్లిద్దరికీ తెలుసు. మరి సిగ్గెందుకు ?

సీత : మీరు ఆర్జించేది ఎనభై రూపాయలేనా ?

నారా : కాక ? కుళాయి లోంచి నీళ్లు పడినట్టు పడుతున్నాయను కున్నావా ఏమిటి – రూపాయలు ?

సీత : పడాలంటే పడనూ పడతాయి ....... ఆ గుర్రం పందేల్లో చూడండి. తిన్నవా ళ్లెంతెంత తింటున్నారో ?

నారా : అదా నీ పాయింటు ? ఇందాకటి నుంచీ ఏమిటా ఈ గొడవ అనుకొంటున్నాను. ఇప్పు డర్థమైందిలే.

సీత : (సాగతీసుకుంటూ) ఆఁ, అర్థం కావలసిందే ! అన్నీ అర్థ మౌతాయి.

నారా : చూడు, సీతా ! గుర్రప్పందేల్లో గెలుచుకొన్నవాళ్ళ డబ్బు ఎక్కణ్ణుంచి వస్తోందంటావ్ ? ఆకాశంలోంచి కురవటం లేదు. ఓడిపోయినవాళ్ళ డబ్బు తీసి గెలిచినవాళ్ళకి ఇస్తారు, గెలిచిన ప్రతి ఒక్కడికీ పాతిక మంది ఓడిపోయినవాళ్ళు ఉంటారు.

సీత : ఆఁ ఉంటారు !

నారా : నవ్వే ప్రతివాడికి ఏడ్చేవాళ్ళు పాతికమంది ఉంటారు ...

సీత : ఆఁ ఉండాల్సిందే.

నారా : అటువంటి పందేలు మన కొద్దు. మనం పందెమేస్తే ఓడి పోతాంగాని గెలవం.

సీత : గెలవం. ఎందుకు గెలుస్తాం ?

నారా : (విసుగ్గా) ఇంతకీ నువ్వేమి టంటావ్ ?

సీత : ఏ మంటాను ? ఇంతకీ అనడానికి నే నెవర్ని ? అసలు అన డానికి నా కేం అధికారం ఉంది ?

నారా : అదేమిటే ? అలా మాట్లాడతావ్ ?

సీత : ఎలా మాటాడేను? నే నేమన్నా మీకు కష్టంగానే ఉంటుంది. పైగా విసుగు కూడాను. పాతకాలపు దాన్ని కాబట్టి మీరు

సుఖంగాను, సంతోషంగాను ఉండాలని కోరుకుంటాను. అందుకనే మీరు మరీ మరీ దూరం చేసుకొంటున్నారు.

నారా : (కొంచెం గట్టిగా) ఏమిటి, నలుగురిలో ఈ రభస ?

సీత : మీకు రభసగానే ఉంటుంది. పైగా నలుగురులోనట. నలుగురు ఎవరండి ? నా తమ్ముడూ, కొడుకూ యేగా ? వాళ్ళకి మెదడు తక్కువని మీరే అన్నారు.

రాము : అమ్మా ! .....

సీత : ఉండరా ! పెద్దాళ్ళు మాటాడుతుంటే మధ్యన రాకని ఎన్ని సార్లు చెప్పాను ?

సూర్యం : అది కాదు, అక్కయ్యా !

సీత : నువ్వేం మాటాడకు సూర్యం !

నారా : చూడు, సీతా ! ఏం జరిగిందో నాకు తెలియటల్లేదు. నీ తల్లో మల్లెపూల సాక్షిగా చెబుతున్నాను. నీ కొంగు పట్టుకొని ప్రమాణం చేస్తున్నాను. నా తప్పేవన్నా ఉంటే క్షమించు. ఇదే ఈ ధూళిదూసరితమైన నేలపై మోకరించి నిలబడియెద గాక ! రాముడు? కళ్ళు మూసుకోరా ! .... సూర్యం ? అటు తిరగవోయ్ !

సీత : (నవ్వుతూ) ఉండండీ ! నా కొంగేం పట్టుకోనక్కర్లేదు. వెళ్ళి దాని కొంగే పట్టుకోండి.

నారా : దేని కొంగు ?

సీత : మీ డబ్బంతా ఎవరి చేతుల్లో పోస్తున్నారో, దాని కొంగు.

నారా : మరి, నీ కొంగు పట్టుకుంటే వద్దన్నావుగా ?

సీత : నేను కాదు. మీ జీతంకాక మిగిలిన డబ్బు ఎవరికిస్తున్నారో వాళ్లు.

నారా : నా జీతం కాక నా దగ్గర డబ్బెక్కడుందే ?

రాము : నీకు గుర్రప్పందేల్లో వచ్చిన డబ్బు నాన్నా !

నారా : (నవ్వుతూ) అదా సంగతి ? మీరు మళ్లీ గుర్రప్పందేల దగ్గర కొచ్చేరన్నమాట ! బాగానే వుంది. చాలా బాగుంది. వండర్ ఫుల్. ఎక్సెలెంట్. సుపర్బ్.

సీత : నాదగ్గర ఇంగ్లీషుకూడా ఎందుకు ఆ కోతలు ?

నారా : తెలుగులో చెప్పమంటావా ? వండర్‌ఫుల్ అంటే ఆశ్చర్యకరమైన అని అర్థం.

సీత : నాకు అర్థం ఏమీ చెప్పనక్కర్లేదు. డబ్బూ యివ్వక్కర్లేదు. ఎంత గడించారో చెప్పండి చాలు !

సూర్యం : చెప్పేసెయ్యి బావా !

నారా : అసలు పందెంలో వెయ్యడానికి నాకు డబ్బు ఎక్కడిదోయ్ ?

సీత : అంతకు ముందు పందెంలో నెగ్గిన డబ్బు !

నారా : దానికి మాత్రం డబ్బు ఎక్కడిది ?

సూర్యం : అంతకు ముందు పందెంలో నెగ్గింది !

నారా : దానికో ?

రాము : అంతకు ముందు నెగ్గింది !

నారా : బాగానే వుంది. ఎప్పుడో అప్పుడు దీనికి ప్రారంభం అంటూ ఉండాలిగా ? గుర్రప్పందేలు పరమేశ్వరుడిలా ఆది మధ్యాంత

రహితాలు అంటారా ఏమిటి, కొంపదీసి ? అసలు అన్నిటి కంటె ముందు డబ్బెలా వేశానంటారు ?

సీత : అప్పో, సొప్పో చేసి.

నారా : సరే ! అప్పే పుట్టేటట్టు ఉంటే రాముణ్ణి ఆ చంచలాక్షి సినీమాకి విడుదల కాకముందే తీసుకెళ్ళే వాణ్ణి. మన మొహం చూసి అప్పెవరిస్తాడే ?

సీత : అదంతా నాకు తెలియదు. మీరు అంకెలు వేసి రాసిన కాయితాలు చూశాం. మీరిచ్చిన సలహాలను గురించి విన్నాం. ఏ గుర్రం నెగ్గుతుందో మీకు ముందే తెలుస్తుందని ఊరంతా చెప్పుకుంటున్నారు. మీకంతా తెలిసి కూడా, పందెంలో డబ్బు పెట్టరంటే ఎవరు నమ్ముతారండీ ?

నారా : సరి సరి ! పరిశోధన చాలా వరకూ సాగిందన్నమాట ! అయితే అసలు కథ చెపుతాను వినండి. ఒక రోజున మా ఆఫీసులో గుమాస్తా ఒకడు ' ఈవేళ రేసెస్‌లో ఏ గుర్రం నెగ్గుతుందోయ్ ?' అన్నాడు. ఏదో కుంటి గుర్రం పేరు చెప్పా. వాడెళ్ళి అందరితోనూ వేళాకోళంగా చెప్పొచ్చాడు. అందరూ ఎవరిష్టమొచ్చినట్టు గుర్రాల మీద డబ్బుపెట్టి వచ్చారు. "రెండో గుర్రం ఏది?" అంటే మరో గుడ్డిగుర్రం పేరు చెప్పాను. దురదృష్టవశాత్తూ నేను చెప్పిన గుర్రాలే వచ్చాయి ! దాంతో నాకు మిడతంభొట్లు పేరొచ్చేసింది. మర్నాటి నుంచీ గుర్రం పందెం మీదా, గుర్రాల మీదా నేనో ఎక్స్‌పర్ట్ ననుకోడం మొదలెట్టారు అందరూ. ఆఖరికి ఎంత వరకూ వచ్చిందంటే మొన్న మన బండెంకడు

వచ్చాడు తన గుర్రానికి మొహం మీద మచ్చ లేచిందట, మంచిదో చెడ్డదో కనుక్కుందామని.

సూర్యం : అదంతా ఎందుకుగాని, బావా, రేపాదివారం రేసెస్‌లో ఏ గుర్రం ముందొస్తుందో చెప్పు నీకు దణ్ణం పెడతాను. ఇంత వరకు గుర్రాలమీద డబ్బు పెట్టినప్పుడల్లా దేముడికో కొబ్బరి కాయ కొడుతూ వచ్చాను. నీకీ మాటో పావలా రకం కొబ్బరికాయ కొడతాను. ... చూడూ, రెండు కొడతాను. ఈ చేత్తోటి ఒకటి, ఆ చేత్తోటి ఒకటి. చెప్పవు? నువ్వు అక్కయ్యకి కాదు. నాకే ప్రత్యక్ష దైవానివి.

సీత : పోనీ చెప్పండీ, వాడు గోలపెడుతున్నాడు.

సూర్యం : చెబితే రాముడికి ఐస్ క్రీమ్ కొనిపెడతా! నువ్వు చెప్పిన గుర్రం వస్తే వాణ్ణి మూడుసార్లు చంచలాక్షి సినీమాకి తీసు కెడతా!

రాము : చెప్పు, నాన్నా! నేను ఐస్ ఫ్రూట్ తిండం నీ కిష్టం లేదా?

నారా : అదికాదు, సూర్యం, తీరా నేను చెప్పిన గుర్రం ఓడిపోతే...

సూర్యం : ఓడిపోదు, బావా, ఓడిపోదు.

సీత : చెప్పండీ, పాపం!

రాము : ఏమిటి, నాన్నా! నేను చంచలాక్షి సినీమాకి మూడుసార్లు వెళ్ళడం నీకిష్టంలేదా?

నారా : తీరా ఓడిపోతే, నా ప్రాణాన పడి ఏడుస్తారు.

సీత : ఏడవరండీ!

నారా : నన్ను పట్టుకు తిడతారు.

సీత : తిట్టరండీ!

సూర్యం : బావా, హాండ్స్ అప్! చెబుతావా? లేకపోతే అమ్మకి టెలిగ్రాం ఇచ్చి రప్పించమంటావా?

నారా : ఒద్దురా, బాబూ, ఒద్దు, చెబుతాను. తరవాత మీ ఇష్టం వచ్చినట్టు చావండి. రేప్పొద్దున ఎనిమిది గంటలకి కనపడు. చెబుతాను.

[విరామ సంగీతం]

సూర్యం : (సంతోషంతో అరుస్తూ) అక్కా! అమ్మా! అక్కా! అక్కా! అమ్మా! ఎక్కడున్నావ్? .... అక్కా? ఎక్కడుందమ్మ? ఎక్కడుందక్క? ఎక్కడుందమ్మ? ... అక్కా! అమ్మెక్కడుంది?

సీత : ఏమిటిరా ఆ గావు కేకలూ నువ్వూనూ? అమ్మ వంటింట్లో కూరలు తరుగుతోంది.

సూర్యం : అమ్మను వెంటనే రమ్మను. ఇంట్లో ఎన్ని సంచులున్నాయో అన్నీ పట్టుకు రమ్మను.

సీత : సంచులేమిట్రా?

సూర్యం : రూపాయ లక్కయ్యా, రూపాయలు. లారీల్లో పోసుకు తెప్పించేస్తున్నాను. వీధి చివర సందుమళుపు దగ్గరుంటాయి యీ పాటికి.

సీత : "ఇంద్ర ధనుస్సు" నెగ్గిందా?

సూర్యం : నెగ్గడమా ? ఇంకా సందేహమా ? ఎందుకూ పనికి రాదను కున్న ఆ గుర్రం వాయువేగ మనోవేగాలతో ముందుకు పోతూంటే మిగిలిన గుర్రాలు తెల్లబోయి చూస్తూ అటూ ఇటూ మెలికలు తిరుగుతూ చక్కా వచ్చాయి !

లక్ష్మమ్మ : ఏవిట్రా, సూర్యం, సంగతి ?

సూర్యం : సంచులు కావాలమ్మా సంచులు, తొందరగా !

లక్ష్మ : ఇప్పుడేవీ ఖాళీగా లేవు. ఒక దాంలో బొగ్గులున్నాయి. ఇంకోటి బయటపడేస్తే ఎండకి వానకీ చివికి తగలడింది. ఉండనిస్తేనా ? ఎన్నికొన్నా ఇంతే ఈ ఇంట్లో ! ఆయన గారొక రాకుమారుడు. ఈవిడ ఒక సుకుమారి. డబ్బంతా ఈవిడ చేతుల్లో పోసేసి, నెల్లాళ్ళూ జపం చేసుకొంటూ కూచుంటాడాయన.

సీత : ఉండమ్మా నువ్వు. నువ్వసలు మాట్లాడడం మొదలెడితే ఆగవు. ఏవిట్రా ? నెగ్గిందా "ఇంద్రధనుస్సు?"

లక్ష్మ : హోరి భగవంతుడా ! ఇంతవరకూ వచ్చిందన్న మాట ! మీ నాన్నే బతికుంటే ఇల్లా అనే వారా మీరు ?

సూర్యం : ఉండమ్మా ! నువ్వూరికే గోలపెట్టకు ! నాన్న లేని లోటు నువ్వు తీరుస్తున్నావుగా ?

సీత : 'ఇంద్రధనుస్సు' నిజంగా గెల్చిందా సూర్యం ?

లక్ష్మ : ఇంద్రధనుస్సు గెలవడ మేమిటే ?

సూర్యం : గెలిచిందా ? అని తాపీగా అడుగుతున్నావా ? – సంచులకొద్దీ డబ్బొచ్చి పడుతూంటే ? కూలీవాళ్లు మొయ్యలేక చస్తున్నారు.

లారీల టైర్లు బరస్టు అయి పోతున్నాయి. రోడ్డుమీద పడి పోతున్న డబ్బు ఏరుకోలేక చస్తున్నారు వచ్చే పోయే వాళ్ళు.

లక్ష్మి : ఎవడిదిరా ఆ డబ్బు – నవాబుదా ?

సూర్యం : ఇంకా నవాబెక్కడే ? మనమే నవాబులమై కూచుంటే ?... అక్కా ! ఏం జరిగిందో తెలుసా ?

సీత : ఏం జరిగిందిరా ?

సూర్యం : మొదట బావ చెప్పినట్టు 'ఇంద్రధనుస్సు' మీద మన నలుగురి పేర తలో పది రూపాయలు పెట్టా ! దాంతో మొత్తం ఎనిమిది వందల రూపాయలు వచ్చాయి. 'ఇంద్రధనుస్సు' నెగ్గుతుందని ఎవరూ అనుకోలేదులే ! రెండో రేసులో 'గ్రామసీమ' నెగ్గుతుందని చెప్పాడు బావ ! ఈ ఎనిమిది వందలు దాని మీద పెట్టా ! హా ! పదహారువేలు వచ్చాయి. ఈ పదహారువేలు తీసుకెళ్ళి మూడో రేసులో 'శ్రీ సంసార్' మీద పెట్టా. బావ చెప్పాడులే "శ్రీ సంసార్" నెగ్గు తుందని ! కాని ఈ లోగానే జనం అంతకీ తెలిసి పోయింది, మనం పెట్టింది నెగ్గుతుందని. అంచేత ముప్పై రెండు వేలే వచ్చాయి.

రాము : ఓస్ ! ఇంతేనా ?

సీత : నువ్వు ముందు పెట్టిన నలభై రూపాయలు ఏమయ్యాయిరా ?

సూర్యం : వస్తూంటే వెనకాల ఎవడో బిచ్చగాడు వెంటబడ్డాడు. వాడు పాపం కుంటాడు, అక్కయ్యా, జాలేసి వాడికి పడేశా.

లక్ష్మి : నువ్వు దుబారా ఖర్చు మానమని ఎన్నిసార్లు చెప్పినా మాన వేంరా, సూరీ ?

సూర్యం : మన నలుగురి పేరా తలో ఎనిమిదివేలూ వచ్చాయి, అక్కయ్యా ! ... అవిగో - బస్తాలు రానే వచ్చాయి ... ఇదిగో, అబ్బీ, ఆ బస్తా అక్కడ దింపుకో .... నువ్వు మూల పెట్టవోయ్ ... ఇదిగో, చూడు, ఆ బస్తా దానిమీద పెట్టు ...

రాము : మామయ్యా, నాకో పావలా ఇయ్యవ్ ? ఐస్ క్రీమ్ కొనుక్కుంటా !

సూర్యం : ఉండ్రా ! వెధవ తిండికి వేళా పాళా లేదూ ?

కూలివాడు నెం. 1 : కూలిప్పించండి, దొరా : మేం జల్దీ పోవాల ...

సూర్యం : తలో గుప్పెడు తీసుకోండోయ్ . , .

కూ.నెం. 2 ; శనా బరు వున్నది, దొరో ! గరీబోళ్ళం.

సూర్యం : సరేనోయ్ ! తలో దోసెడూ తీసుకోండి. మాకు మాత్రం ఊరికే వచ్చా యనుకున్నారా ఏమిటి ?

కూ.నెం. 1 : తమరిదయ గిట్టుండాలి. దొరో ! ఎల్లొస్తాం.

సూర్యం : సరే ? ఈ పావలా కూడా తీసుకోండి! ఆకులు కొనుక్కోండి.

రాము : అమ్మా ! ఒక్క రూపాయిప్వవ్ ? సినీమా కెడతానే! మంచి సినీమా వచ్చిందే ! వెళ్ళొద్దూ ?...అమ్మా !

సీత : ఒరేయి, రాముడూ ! పెద్దవాళ్ళు మాట్లాడుతుంటే మాట్లాడొద్దని ఎన్నిసార్లు చెప్పానురా ? ... సూరీ ! ఆయనపేరన కూడా ఓ పదిరూపాయలు వెయ్యలేకపోయావా ?

సూర్యం : వద్దన్నాడు, అక్కయ్యా ! ఎంత చెప్పినా, వినలేదు. ''మీ ఇష్ట మొచ్చినట్లు ఏడవండి ! నా పేరన వెయ్యొద్దు'' అన్నాడు.

సీత : బాగానే ఉంది. ఈ మనిషికి బుద్ధెప్పు డొస్తుందో తెలియదు.

లక్ష్మ : నేను నీ పెళ్ళినాడే చెబితే విన్నావు? ఎర్రగా బుర్రగా ఉన్నాడు కదా అని ఒప్పుకున్నావు. మీ నాన్న సరేసరి. ఆయనకు ఏంతోస్తే అదే! ఒకసారి ''ఉల్లిపాయ పులుసులో వెయ్యాలి. బెల్లం తీసుకురండీ!" అన్నాను.... "ఆఁ ఉల్లి పాయ పులుసులో బెల్లం దేనికీ?...."

సూర్యం : ఇప్పు డా ఉల్లిపాయపులుసు సంగతి దేనికమ్మా?

లక్ష్మ : మాటవరసకి చెబుతున్నాను. ''బెల్లం దేనికీ?'' అన్నారు. నేను అన్నాను...

సూర్యం : ఉండవే! ఇప్పుడున్న గొడవలు చాలక అవన్నీ దేని కిప్పుడు?

లక్ష్మ : సరేలేరా బాబూ! మాట్లాడనులే! ఇంత వరకూ వచ్చిందీ బతుకు. మీ నాన్నే బతికుంటే ఇల్లా అనేవారా మీరు?

సూర్యం : ఓ! భేషుగ్గా!

రాము : మామయ్యా! నా 7,999 రూపాయలు దాచి, ఒక్క రూపా యివ్వవూ, సినీమాకి వెడతాను.

సీత : ఎందుకు వెయ్యొద్దన్నారు, సూర్యం?

సూర్యం : ఈ గుర్రాలు నెగ్గుతాయని తనకు నమ్మకం లేదుట; వృధాగా డబ్బు ఖర్చు చెయ్యటం తనకి ఇష్టం లేదుట. "పోనీలే, దావా. నీకొక్కడా నేనే ఖర్చు పెడతానులే!" అన్నాను. ససేమిరా పనికిరా దన్నాడు.

సీత : ఇంటికి రానీ అడుగుతాను.

నారా : ఏంవిటర్రా ఈ బస్తాలన్నీ ? అట్లా కూచున్నారేమిటి మీరంతా కుట్రదారుల్లా ?

సూర్యం : ఇంద్రధనుస్సు నెగ్గింది, బావా.

నారా : విన్నానురా, విన్నాను. చాలా సంతోషం.

సూర్యం : ఈ బస్తాలన్నీ ఏమిటో తెలుసా ? డబ్బు. డబ్బులు కుప్పలు కుప్పలు. ఆ బస్తా రూపాయలది. ఈ బస్తాలో పావలాలు. అది అణాకాసులు. ఇది నయా పైసలు.

నారా : Good, very good! ఇప్పటికేనా బుద్ధి తెచ్చుకొని, ఆ డబ్బు బేంకులో వేసుకోండి.

సూర్యం : అదేమిటి బావా ? అల్లా ఆవందం తాగినట్లుగా మాట్లాడతావు! నీ హృదయం సంతోషంతో ఎగిరి గంతు లెయ్యటం లేదూ ?

నారా : లేదు.

సూర్యం : నీకు గాలిలో నడవాలని బుద్ధిపుట్టడంలేదూ ?

నారా : లేదు.

సూర్యం : నీకు డాబామీద నుంచొని గాలిపటా లెగరెయ్యా లనిపించటం లేదు ? రోడ్డుమీదకు పోయి డేన్సు చెయ్యా లనిపించటల్లేదు ?

నారా : లేదు, లేదు.

సూర్యం : ఎక్కడి వాపవు, బావా, సుప్పు ? ఇటువంటి బావ పుడతా డని నేను కలలో కూడా అనుకోలేదు.

సీత : ఏమండీ? మీరు పదిరూపాయలు మీ పేర వెయ్యొద్దన్నారా? వా దేస్తే మీ కేమిబ్బం దొచ్చిందండీ?

నారా : నా జేబులో కష్టార్జితం పది రూపాయలున్నాయి పొద్దున్న. ఈ పది రూపాయలు ఎలా వచ్చాయో తెలుసా? నాలుగురోజులు పొద్దున్నుంచి సాయంత్రం వరకు చెమటోడ్చి పని చేస్తే వచ్చాయి. పొద్దున్న పది రూపాయ లున్నాయా జేబులో? ఇప్పుడు కూడా పదిరూపాయ లున్నాయి. నువ్వెంత పెట్టావు గుర్రాల మీద? నలభై రూపాయలు. అవి నీ అదృష్టంవల్ల పెరిగాయి. ముగ్గురు రౌతులు ప్రాణాలకు తెగించి పరుగెత్తడంవల్ల నీ జేబులో నలభై రూపాయలు ఓ నాలుగువందల రెట్లు పెరిగాయి. అవి అల్లా పరుగెత్తకపోతే? అందులో మొదటిగుర్రం నాడా మధ్యలో విరిగిందనుకో. అందులో ఒక రౌతు తల తిరిగిందనుకో. నీ జేబులో పైసలు ఖాళీ అయ్యేవి.

సూర్యం : అది కాదు, బావా...

నారా : నా మాట విను సూర్యం! మధ్యలో అడ్డు రాకు. నీ గుర్రం కాలు బెణికితే - మిగిలిన గుర్రాలు బాగా పరుగెత్తితే - నీ జేబులు ఖాళీ అయ్యేవి. అంతేనా?

సూర్యం : అది సరే, బావా ....

నారా : ఈనాడు, డబ్బుసంచీ చేతి కందిచ్చిన అదృష్టం - రేపు అటు తిరిగి జోలి చేతికిస్తుంది .... ముష్టెత్తుకోమని - జాగ్రత్తగా ఉండకపోతే! ...డబ్బంటే నాకు మాత్రం ఆశ లేదను కున్నావా? నిన్న వెయ్యవద్దని చెప్పానుగా? కాసే పాగి

నేనూ ఉండలేకపోయాను. నాలో మీకు నమ్మకం ఉంది. కాదూ? నాకు లేదు. నాలో నమ్మకం లేదు. పదిరూపాయలు పట్టుకెళ్ళి "ఇంద్రధనస్సు" మీద వేశాను; రెండు వందల రూపాయలొచ్చాయి. రెండోసారి ఏం చేశానో తెలుసా? పది రూపాయలు మిగిల్చి మిగతాది తీసుకెళ్లి "విచిత్రవీణ" మీద వేశాను. అంతా షవరమైపోయింది.

సీత : అలా ఎందుకు చెయ్యాలి?

నారా : నా లెక్కల్లోనే నాకు నమ్మకం లేకపోయింది కాబట్టి.

సీత : అదే తెలివితక్కువతనం! మాకు నమ్మకం ఉంది మీరంటే.

లక్ష్మి : తెలివితక్కువతన మనాలా? ఇంకా ఏమన్నా అనాలా?

సూర్యం : దేనికైనా ఆత్మవిశ్వాసం అవసరం, బావా?

నారా : అసలు ఫలానాగుర్రం నెగ్గుతుందని మీకు ఎలా చెబుతున్నానో తెలుసా? భగవంతుడు కల్లో కనపడి చెబుతున్నాడని అనుకుంటున్నారు కాదూ?

సూర్యం : భగవంతుడు కాకపోతే, ఏ మహర్షో?

నారా : ఏ మహర్షో మంత్రోపదేశం చేశా డనుకొంటున్నారు. శుద్ధ పొరపాటు. అంతా మిడతంభొట్లు పద్ధతిలో సాగుతుంది. నాపై ఆఫీసర్లకి నమ్మకం కుదిరిన మర్నాటినుంచి జ్యోతిషం చెప్పటం తప్పనిసరైంది నాకు. అంతకీ "నాకేం తెలియదండీ" అని చెబుతూనే ఉన్నాను. మొదటిసారి రాత్రి కలలోకి ఏవో గుర్రాలు పరుగెత్తుకుంటూ వచ్చాయి. అందులో ఒక తెల్ల గుర్రం అన్నిటికంటె ముందు పరుగెత్తింది. "ఈ గుర్రం

పేరు తెలుస్తే బావుణ్ణురా' అనుకున్నాను. ఇంతలో ఒక అంకె - ఆ అంకె గిర్రున తిరుగుతూవచ్చి, కంటిముందు వాలింది. మర్నాటి గుర్రాల్లో ఆ రక్షరాల పేరుగలది ఏదా? అని చూశాను. ఒకటి కనుపించింది. దానిపేరే వేశాను.

సీత :
సూర్యం : } నెగ్గిందా ?

నారా : నెగ్గింది. గెలిచింది. అది నా జీవితంలో ఒక దుర్దినం. ఆనాటి నుంచీ, అందరూ - ముఖ్యంగా పై ఆఫీసర్లు - ఈ జ్యోతిషం కోసం నాదగ్గర కొస్తున్నారు. వచ్చే రేసెస్‌లో ఏ గుర్రం ఫస్టొస్తుందో చెప్పడం నా ఆఫీసు డ్యూటీల్లో ఒక్కటై పోయింది. చెప్పకపోతే ఆఫీసర్లకు కోపం వస్తుంది. ఇప్పుడు మీకొచ్చినట్లే....ఎప్పుడో ఇదంతా బ్రద్దలయి నానెత్తి మీద పడుతుంది. నావెనకాల ఏదేవతలూ ఏ మహర్షులూ లేరు. మీకు మళ్ళీ చెబుతున్నాను...నాలో ఆశలు రేకెత్తించకండి! చెపటోడ్చి సంపాదించే ఎనభయి రూపాయలూ చాలు నాకు.

సూర్యం : నీకోమాట చెప్పనా, బావా ?

నారా : రేసెస్‌లో గెలుపుమీద అనవసరపుటాశలు పెట్టుకోకు, సూర్యం! గెలుపుకీ, ఓటమికీ సరిహద్దు దారవ్వోచంత వెడల్పు కూడా ఉండదు రేసెస్‌లో.

సూర్యం : నీకోమాట చెప్పనా, బావా ? నీలో నీకు ఆత్మవిశ్వాసం లేదు. నెలకు ఎనభయి రూపాయలు ఎల్లాసరి పోతాయి చెప్పు.

సీత : పిల్లాడు సినీమాకి వెడతానని ఒక్కరూపాయి అడిగితే దగ్గర డబ్బులేకపోయింది....కడుపుతరుక్కుపోయింది.

రాము : మనకొచ్చే డబ్బుతో ఎన్ని సినీమాలైనా తియ్యొచ్చు. నాన్నా ?

లక్ష్మ : డబ్బొస్తుంటే పద్దనేవాళ్ళు కూడా ఉంటారు కాబోలు.

సూర్య : మంచి ఉత్సాహంమీద తెచ్చి మంచినీళ్ళు గుమ్మరిస్తావు. బావా! ఇప్పుడొచ్చిన డబ్బుతో నువ్వు ఉద్యోగం మానేసి కాలుమీద కాలేసుకుని కూచోవచ్చు.

నారా : బాగానే ఉంది.

సీత : అవునండీ ... వెధవ ఉద్యోగం దేనికి చెప్పండి ? హాయిగా విశ్రాంతిగా ఇంట్లో కూచుంటే ఇంకా బాగా చెప్పగలరు – ఏ గుర్రం నెగ్గుతుందో ?

రాము : అవును, నాన్నా : వెధవ ఆఫీసుకి వెళ్ళకు, నాన్నా ! మన సినీమా నువ్వే డైరెక్టు చేద్దుగాని.

లక్ష్మ : ఎందుకు చెబుతున్నానో, విను, నాయనా ! లక్ష్మి వస్తూంటే మోకాలడ్డు పెట్టకు. కోపం వచ్చిందంటే మళ్ళీ మొహం చూపించదా మహాతల్లి.

సీత : వెధవ ఉద్యోగం మానెయ్యండీ !

సూర్యం : అవును, బావా ! మానేసెయ్యి. ఈ మాటు మంచి గుర్రం పేరు చెప్పు. మన డబ్బంతా దాని మీద పెట్టేద్దాం. ఓ లక్ష రూపాయలొస్తాయి. దాంతరువాత మానేద్దాం.

సీత : దాంతరువాత మీరు చెప్పిన గుర్రాలు నెగ్గక పోవచ్చు.

లక్ష్మ : నువ్వే అన్నావు కాదుటోయ్ – ఏదేవతా దెయ్యం లేరని నీవెనకాల ?

సూర్యం : హేమ్లెట్ ఏమ(న్నాడు, బావా ?

లక్ష్మి : వాడెవడురా ?

సూర్యం : వాడో గొప్ప ఇంగ్లీషాయనలే అమ్మా ! పినతండ్రిని చంపె య్యాలనుకున్నాడు. చంపేశాడు పట్టపగలు.

లక్ష్మి : హారినీయిల్లు బంగారంగాను ! వాడి కదేం పొయ్యేకాలంరా ?

రాము : నాకా పుస్తకం కొనిపెట్టవు, మామయ్యా ? నాకు డిటెక్టివ్ నవల్లంటే ఇష్టం.

సీత : ఉండరా నువ్వు ! పెద్దవాళ్లు మాట్లాడుతుంటే నువ్వేమిటి మధ్యన ?

సూర్యం : హేమ్లెట్ ఏమ(న్నాడు బావా ? . . . 'మనుష్యుల జీవితాల్లో ఆటుపోటులుంటాయి. పోటు ఉన్నప్పుడే అవకాశం విని యోగించుకోవాలి ' అనలే ?

లక్ష్మి : నేను చెప్పిన మాటవిని ఆ కాయితం పెట్టెయ్యవోయ్ ?

సీత : మాట్లాడరేమండీ ? ఇంత డబ్బు వచ్చిన తర్వాత మీరుకష్ట పడుతూంటే నేను చూడలేను. మీరు ఉద్యోగం మానెయ్యక పోతే నేను ఏ బావిలోనో పడి చస్తా!....చూశావా ? అమ్మా ! (ఏడుపు కంఠంతో) మాటాడకుండా ఎల్లా బెల్లం కొట్టిన రాయల్లే నుంచున్నారో ?

లక్ష్మి : పిల్లదాని మనస్సు కష్టపెట్టకోయ్ —— నువ్వు నూతిలో పడితే నేను మాత్రం ఉంటానుటే ? నేనూ ఛస్తాను.

సూర్య : "కలకంఠి కంటి కన్నీరొలికిన ఇంట సిరి యుండ నొల్లదు", విను,బావా! విను. అక్కయ్య మనసు కష్టపెట్టకు—మీరు చస్తే నేను మాత్రం ఉంటానేమిటి ఇక్కడ ? నేనూ చస్తాను.

రాము : నేను మాత్రం ఉంటానేమిటి ?... నేను సినీమాల్లోకి పోయి చేరిపోతా !

నారా : అబ్బబ్బబ్బబ్బ ! చంపేస్తున్నారు మీరంతా కలిసి ! నన్ను సర్వనాశనం జేసి మీరు సర్వనాశనం కండి ! మీ ఇష్ట మొచ్చి నట్లు కానీండి ! ఇప్పుడే పోయి రాజీనామా కాయితం పెడతా!

సూర్యం : అల్లా దార్లోకిరా బావా ! ఇప్పుడు బాగా ఆలోచించి నెగ్గే గుర్రం పేరు చెప్పు. ఉన్న డబ్బంతా పెట్టేస్తా !

సీత : వేణ్ణీళ్ళు కాస్తాను. హాయిగా ఆలా మంచం మీద పడుకొండి !

రాము : ఓపావలా ఉంటే ఇస్తావా, అమ్మా ? నాన్నగారికి ఐస్క్రీమ్ కొనిపెడతా !

సీత : అక్కడ మెంతుల డబ్బాలో ఉన్నాయి తీసుకోరా డబ్బులు.

లక్ష్మి : పోనీ, సీతా, అతనికి కాఫీ కాచివ్వనా ? పాపం, తిరిగి తిరిగొచ్చాడు.

రాము : సినీమాకి వెడదాం, నాన్నా ! మంచి సినీమా : ఓడియన్‌లో.

సూర్యం : పోనీ వెళ్లు, బావా ! నవ్వొస్తూంటుందిట. విశ్రాంతిగా ఉంటుంది.

నారా : నాదగ్గర చిల్లరలేదు. పదిరూపాయల నోటు మార్చను.

సూర్యం : ఒరేయి, రాముడూ, ఆ మూల బస్తాలోవి ఓ గుప్పెడు రూపాయిలు తీసి నాన్నగారి జేబులో పొయ్యరా !

రాము : గుప్పెడేం చాలతాయి మామయ్యా ? అందులో నాది చిన్న చెయ్యి.

సూర్యం : గుప్పెడు కాకపోతే దోశెడు.

నారా : (విసుగ్గా) ఏమిటీ గోలంతా – గుప్పెడూ, దోశెడూ అంటూ పొండి! దూరంగా పొండి!... ఊఁ!

[ఆందోళన సూచించే సంగీతం నెమ్మదిగా fade in అయి అంతా ఆవరిస్తుంది. అయిపోయిన ఒక క్షణానికి నారాయణ రావు కంఠం – స్వగతం ].

హే భగవాన్! ప్రపంచమంతా డబ్బు మీదనే గిర్రున తిరుగుతోందయ్యా! వీళ్ళకి ఒక్కొక్కళ్ళకి ఎనిమిదివందల రూపాయలిచ్చాప్, చాలదూ?... ఉహూఁ! ఇంకా కావాలిట. ఆశకంతు లేదు, ప్రభూ! కాని ఏం చెయ్యను? ఉన్న డబ్బు గూడా తగలెడుతారట! మా అత్తగారితో కంటే నీతో నా కష్టాలు తొందరగా మనవి చేసుకోగలను. వాళ్ళు వినరుగదా మనమాట? ఇప్పుడు మంచి కల తెప్పించు. కలలో సరియైన గుర్రాన్ని చూపించు. ఈ ఒక్కసారిమాత్రం నెగ్గే ఏర్పాటు చేయించు. దాంతరువాత నిన్ను అడగనుగా? అడగనని మాట ఇస్తున్నాను!

[ దూరంగా పోయి కొంచెం గట్టిగా ] ఇదిగో చూడు! కల సంగతి మరచి పోకేం! తప్పకుండా రావాలి!

[ విరామ సంగీతము తరువాత రేస్‌కోర్సులో వినపడే ధ్వనులు – జనం – గగ్గోలు 'ఇది నెగ్గుతుంది' ... 'అది ముందుకు పోతోంది' etc. కేకలు... ]

సూర్యం : "అరుణోదయం" నెగ్గుతుందంటావా?

సీత : నెగ్గకేం చేస్తుందిరా. నీ వెర్రికాని! అదిగో చూడు. ఆ ఎర్ర

గుర్రాన్ని దాటేసింది ! ఆ తెల్ల గుర్రం వరకు వచ్చింది. తెల్లగుర్రాన్ని కూడా దాటేస్తోంది...దాటేసింది...ముందుకు పోతూంది....

సూర్యం : దాటేసిందా ? దాటేసిందా ? ఏదీ ఇల్లాఇయ్యి. నేను చూస్తాను.

సీత : దాటకేం చేస్తుందిరా — మీ బావగారు చెప్పిన తర్వాత ?

సూర్యం : ఉండవే నువ్వు : ఆ తెల్లగుర్రమే అరుణోదయం.

రాము : ఉండండర్రా ! నేను చూస్తాను...మామయ్యా ! ... నాన్నా ! .... అమ్మా ! .... నా కిమ్మనవ్ ?

సూర్యం : అదేఁవిటి బావా, అరుణోదయం వెనక్కి పోతూంది.

నారా : అలాగే పోతుందిరా, అది నెగ్గదు.

సూర్యం : అద్గదీ ! అద్గదీ ! అరుణోదయం మళ్ళీ ముందుకు పోతూంది. [ జనం గగ్గోలు ఎక్కువవుతుంది ] ఇంకా ముందుకు పోతూంది.

సీత : నెగ్గకేం చేస్తుందండీ — మరీ చోద్యం కాకపోతే ?

లక్ష్మి : అది నా కంటికి కూడా పెట్టరూ !

సూర్యం : అయిపోయింది. అయిపోయింది, అక్కయ్యా ! మన 32 వేల రూపాయలు తగులడి పోయాయి. క్షవరమయి పోయాయి.

సీత : ఏమయిందిరా ?

సూర్యం : అంతా అయిపోయింది. అంతా క్షవరమయి పోయింది.

సీత : ఏమిటండీ ఇల్లా చేశారు మీరు ?

నారా : ఎవరు ?

సీత : ఏరు !

సూర్యం : మనం నెగ్గడం ఇష్టంలేక అబద్ధంపేరు చెప్పాడు.

రాము : నువ్వే. మామయ్యా. అంతా ఒక్క రూపాయి కూడా మిగల్చకుండా అంతా దానిమీద పెట్టేశావు !

సూర్యం : నాకేం తెలుసు ? ఆ పెద్దమనిషి అబద్ధాలాడరాదని ?

లక్ష్మి : లక్ష్మొస్తానంటే అడ్డుపెడితే ఏమవుతుంది ? ఆ మహాతల్లికి కోపం వచ్చింది.

సీత : ఒకటీ రెండూ కాదు ముప్పైరెండువేల రూపాయలు !

లక్ష్మి : పైగా ఉద్యోగానికి కూడా నీళ్ళు వదులుకున్నాడు !

నారా : లేదు. వదులుకోలేదు.

లక్ష్మి
సీత
సూర్యం
రాము
: లేదూ ?

నారా : లేదు.

సూర్యం : తన సంగతి తను చూసుకుంటాడని ముందునుంచీ అనుకుంటూనే వున్నాను : ఈ ప్రపంచలో ఉన్న స్వార్థాన్ని చూస్తుంటే – జీవితంపై విరక్తి కలుగుతుంది.

నారా : స్వార్థం ? ఏమిట్రా స్వార్థం ? ఎవడి జీవితాన్ని వాడు గడపాలనుకోడం స్వార్థమా ? రేసెస్‌లో గెలుపుకీ, ఓటమికీ మధ్య సరిహద్దు సన్నగా ఉంటుందని అప్పుడే చెబితే

ఏన్నారు ! పైగా, నేను ఉద్యోగానికి నీళ్ళు వదులుకోవాలను కున్నారు. డబ్బు చూసేసరికి కళ్ళు తిరిగిపోయాయి. కలలు కల్లలు . . . పైగా "కల కావాలి కావాలి" . . .అనుకుంటే సరియైన కలవస్తుందా ?

సీత : ముప్పైరెండువేల రూపాయలు. ఒకటి రెండు కాదు.

నారా ; . . . మీరు డబ్బుకోసం కలకనమంటే. నేను దరిద్రాన్ని— దరిద్రాన్ని ఎదుర్కోలేక, కలలు కనాలని తహతహ పడ్డాను. ఐపోయిందేదో ఐపోయింది. నాకేం విచారంలేదు.

లక్ష్మి : లేదు. లేదు. ఎందుకుంటుంది ? ( నిట్టూర్పువిడిచి ) లక్ష రూపాయలు వచ్చేవి !

నారా : బయటనుంచి వచ్చిన డబ్బు పోతేపోయింది. నా ఉద్యోగ మైనా మిగిలింది.

రాము : అమ్మా ! ఒక్క రూపాయుంటే ఇప్పుడే ! మంచి సినిమా వచ్చింది . . . . . ఓడియన్‌లో విశ్వంభరావారి "చంచలాక్షి". . . .

సీత : ఉండ్రా ! పెద్దవాళ్ళు మాటాడుతుంటే మధ్యన నువ్వు . . .
[ రాముడు డైలాగు అయిపోయిన వెంటనే నేపథ్యంలో లౌడుస్పీకరు ప్రకటన fade in అవుతుంది. "విశ్వంభరావారి "చంచలాక్షి" నేడే చూడండి. మహత్తర సాంఘిక చిత్రం వెంకట్రావు, గుమ్మడిదల, వేలంగి. జోగేశ్వర్రావు. నాట్య తార పద్మ . . . జంటనగరాలలో ఒకేసారి ప్రదర్శన ప్రారంభం . . . " [ fade out ] —

[ 1957 ]

# ద్రాక్షారామోదంతం

## 10

నాకు సన్మానం ఏర్పాటుచేయిస్తే బాగుంటుందని గవర్నమెంట్ ఆఫ్ ఇండియాకి రాశాను. ఇంకా జవాబు రాలేదు. రాసి, అప్పుడే రెండు నెల్లయింది. ప్రతిరోజూ పోస్టులో ఎదురు చూస్తున్నాను. ఎప్పుడైనా రావచ్చు. గవర్నమెంటు ఉత్తరాలన్నీ సాధారణంగా ఆలస్యంగా వస్తాయిట. కొంచెం తేడాగా నాకు సరిపోయే బిరుదులన్నీ లిస్టు తయారు చేసి, గెజెటెడ్ ఆఫీసర్ సర్టిఫికేటు కూడా జతపర్చి కూడా పంపించాను. మీరీ వాక్యాలు చదివే సరికే బహుశః 'హాస్యరచనా దురంధర' అనో, 'హాస్య కళా ప్రపూర్ణ' అనో, 'హసన్ముఖ' అనో, 'విదూషకోత్తమ ( = విశేషంగా దూషించే వాళ్ళల్లో ఉత్తముడు )' అనో ఏదో ఒకటి బిరుదు పోస్టులో పంపిస్తుంది, గవర్నమెంట్. దాం తర్వాత మీరు విచారించి లాభం ఉండదు : పొగడదలచుకొన్న వాళ్ళెవరో ముందే పొగిడెయ్యండి వచ్చి. అలా క్యూలో నిలబడండి. థేంక్యూ.

సన్మానం చేయించుకోవడం ఇంత సులభం అని తెలియదు నాకు పూర్వం. పూర్వం బిరుదు సంపాదించుకోవాలంటే, చాలా ఎర్రటేపు అడ్డం వచ్చేదిట. 'కవి సార్వభౌమ' అని బిరుదు సంపాదించుకోవాలంటే, 'కవి' అనిపించుకోవాల్సివచ్చేదిట ముందు. తరువాత కవులంద

రితో యుద్ధం చేయాల్సివచ్చేదట. కంచుఢక్కాయి అక్కడా ఇక్కడా ఎదురైతే పగలగొట్టించాల్సి వచ్చేదిట. పసీడితులతో ముఖాముఖీ నఖానఖీ పోట్లాడవలసి వచ్చేదిట. ఇప్పుడవన్నీ టైమ్ వేస్టు. యుద్ధకాలంలో సిమెంటు పెర్మిటు కన్నా, ప్రొహిబిషన్ కాలంలో లిక్కర్ పెర్మిట్ కన్నా త్వరగా లభిస్తాయి బిరుదులు. అంతా సరైన విధంలో పట్టుకోవడంలో ఉంది.

నాకు చాలా దగ్గర స్నేహితు డొక డున్నాడు. ఆఫీసు పదిగంటలకి తెరుస్తే, పన్నెండు గంటలకి వస్తాడతను. ఐదుగంటలకి మూసేస్తే, మూడుగంటలకే వెళ్ళిపోతాడు. 'ఏం బ్రదర్, నీ ఉద్యోగం ఎప్పుడో వూడిపోతుంది' అని హెచ్చరిక చేస్తూ వచ్చాను. 'ఏమీ ఫరవాలేదు' అనే వాడు. ఆఫీసు టెలిఫోన్ దగ్గర ఒక చప్రాసీని పెట్టాట్ట. 'ఎవరైనా దాక్షారామంగారున్నారా?' అని టెలిఫోన్ చేస్తే, అసెంబ్లీకి వెళ్లారని సమాధానం చెబుతాట్ట. చప్రాసీకి పది నుంచి పన్నెండు వరకు, మూడు నుంచి ఐదువరకు వుద్యోగం. ఇతనికి పన్నెండు నుంచి మూడు వరకు.

ఇది ఇలా ఉండగా, అతనికి హఠాత్తుగా ప్రమోషన్ వచ్చింది. మాకందరికీ మూర్ఛవచ్చినంత పనైంది. తేరుకోకుండానే, టీపార్టీ యిచ్చేశాం. మనిషి చాలా కరుకు మనిషి. కాని మా ఖర్చు మీద వద్దంటూనే వెన్న, బిస్కట్లు తిన్నాడేమో మనిషి కొంచెం మెత్తబడ్డాడు. 'సోదరా, ద్రాక్షారామం, నువ్వు ఉద్యోగం చెలాయిస్తున్న ధోరణి చూస్తే, నీ ఉద్యోగం పోక తప్పదని మేమంతా ఎప్పుడో నిశ్చయం చేసుకున్నాం. నీకే ప్రమోషన్ వచ్చింది. ఎప్పుడు, ఎక్కడ ఎలా, ఎందుకు, ఏమిటి చేశావ్? చెప్పు' అన్నాం. 'ఇక్కడ పత్రికా విలేఖరులు ఎవరూ లేరుగా?' అన్నాడు. అందరూ నా వైపు అనుమానంగా చూశారు. 'ఆఁ, నా మొహం! నేను కూడా పత్రికా విలేఖరినే?

చెబుమా !' అన్నాను. 'గోడలకి చెవులుంటాయ్' అన్నాడు. 'ఇప్పుడు మనుష్యుల చెవులకే గోడలు కట్టుకుంటున్నారు. ఫర్వాలేదు. చెప్పు' అన్నాం. పరధ్యానంగా ప్లేటులో చెంచా జేబులో వేసుకుంటూ తన కథంతా చెప్పాడు.

మొదట పద్యాలు కట్టడం నేర్చుకున్నా నన్నాడు. 'ఎలా ?' అన్నాం. 'ఇల్లు కట్టినట్టే. గణానికి గణానికి పేర్చి కట్టెయ్యడం' అన్నాడు. మేం అంతా అర్థమైనట్టు, తలలు వూపాం. మాలో అర్భకుడొకడు మాత్రం, తెలివి తక్కువగా తన అజ్ఞానాన్ని వెల్లడించుకుంటూ, 'మరి— భావాలో ?' అన్నాడు. మేం అంతా పకపకా నవ్వేశాం. నేను వాడి వీపు చరిచి కూచోబెట్టి, 'ఊరికే తెలివి తక్కువగా మాటాడకు. ఇల్లంటే అన్నీ గోడలే ఉంటాయా — రెండు మూడు గదులకో కిటికీ వుండదా - పక్కింట్లో గాలి పారిపోయి రావడానికి ? అలాగే రెండు మూడు పద్యాలకి ఒక భావం రావడానికి చోటుంచుతారు' అన్నాను. వాడింక మాటాడలేదు.

పద్యాలు కట్టడం నేర్చుకున్న తర్వాత, గేయాలు రాయడం ప్రారంభించాట్ట. మొదట్లో వాళ్ళమీదా, వీళ్ళమీదా రాశాట్ట. ఇంతలోగా స్వాతంత్ర్యం వచ్చింది, దేశానికి ! ఆగస్టు పదిహేనుమీద పద్యాలు, గేయాలు రాశాట్ట :

" ఈవాళ ఆగస్టు పదిహేను,
ఎవరన్నా కాదంటే తంతాను నేను.
రేపు పదహారు, నిన్న పద్నాలుగు
మొన్న పదమూడు, ఎల్లుండి పదిహేడు
అనుమానం వస్తే - కేలండరు చూడు... "

అంటూ, జనవరి 26 మీద కూడా ఇటువంటి గేయాలే రాశాట్ట. ఇలాగే పండుగ పండుక్కీ-రాసి పెట్టుకున్నాట్ట. పంచవర్ష ప్రణాళిక మీద ఒక అరడజను రాశాట్ట. చేసేది వారానికి పదిరాసుకున్నాట్ట. "పాకిస్తాన్! నీచెవిక కీ ఇస్తాన్" అని తను వ్రాసిన గేయానికి బహుమతి సగం దూరం వచ్చి, ఆగిపోయింది అన్నాడు. ఈ లోగా చైనా దురాక్రమణ వార్తలు వచ్చాయి.

" ఓరి——చౌఎన్ లాయీ
నీ కిక లేదు హాయి......
హోరి పిమ్మ్యానిస్టూ !
మా దేశానికి పెస్టు ! !
మాకు ఉత్తరాన ఉంది హిమాలయశృంగం
జ్ఞాపకం లేదా దక్షగర్వభంగం ?...... "

అంటూ గేయాలు రాసి, సంపుటి ప్రకటించాట్ట. హిందీలా ఉన్న ఇంగ్లీషులోకి, ఇంగ్లీషులా ఉన్న హిందీలోకి తర్జుమాకూడా చేయించాట్ట.

ఇది విన్న మేమంతా కరతాళ ధ్వనులు చేశాం. 'బిరుదులు తెచ్చుకోడం ఇంత సులభం కదా ?' అని. రామానికి కోపం వచ్చింది. పరీక్ష పేపరైన కుర్రాడెవడూ, పరీక్ష పేపరు సులభంగా ఉందంటే ఒప్పుకోడు. ఫెయిలయిన కుర్రాడు అసలు ఒప్పుకోడు. పరీక్షకి కూచోని వాళ్ళకే పేపరు సులభంగా కనిపిస్తుంది. అందుకనే బిరుదులు సంపాదించుకోడం చాలా సులభం అని మేమంటే, ద్రాక్షారామానికి కోపం వచ్చింది. 'మీరలా మాటాడితే, బిస్కట్లు ఇంక తినను' అన్నాడు. ఇంటికి పట్టుకెళ్ళడానికి జేబులో పడేసుకున్న వాటితో సహా ! మాకు

భయం వేసింది. 'తినండి, తినండి' అన్నాం. 'ఐతే — వినండి' అన్నాడు.

బిరుదులు రావడం అంత సులభమైన పనేం కాదన్నాడు. ఇలాగా కష్టపడి గేయాలు రాయగారాయగా కవి సమ్మేళనాలకు పిలుపులురావడం ప్రారంభ మయ్యాయి అన్నాడు. కవి సమ్మేళనాలు 'సత్కా-కవిమేళనాలు' కావా లని రూలు లేదుగా ? ముందే మంత్రులందరిమీదా పద్యాలు రాసి అట్టే పెట్టుకున్నాట్ట. ఏమంత్రిగారు కవి సమ్మేళనానికి అధ్యక్షత వహిస్తే, ఆ మంత్రిగారి మీద పద్యాలు కూడా చదివాట్ట. ఆర్నెల్లు తిరిగేటప్పటికి, మారిపోయిన మంత్రులతో సహా అందరివంతూ ఐపోయి, వచ్చిన మంత్రులే మళ్ళీ రావడం ప్రారంభించారు అన్నాడు. ఒక్కొ-క్కప్పుడు ఆఫీసర్లు, ఎమ్. ఎల్. ఏ.లు, కూడా రావడం ప్రారంభించారట. పద్యాలు రోజూ రాసి, అట్టే పెట్టుకోవలసి వచ్చిందట. అందుకని కొన్ని పేర్లు తీసుకుని రాసి అట్టే పెట్టుకున్నాట్ట. 'నరుని మేధస్సు నీయది, నీయది సింహమ్ము బలమ్ము....' అంటూ నరసింహారావు, నర్సింగరావు, నరసింహస్వామి, మూర్తి ఎటసెటరాకి సరిపోయేటట్టు, 'రామా, అభిరామా, నిన్ పట్టంగ నాత రా...మా ? దేశం పై నీశ్రద్ధకి అసలే లేదు కామా !....' అంటూ రామయ్య, రామమూర్తి, రామారావు, రామస్వామి ఎటసెటరాకి సరిపోయేటట్టు ... ఈ విధంగా.

ఐనా - రాలేదుట బిరుదులు. అప్పుడు దర్యాప్తు చేస్తే, తెలిసిందట. ప్రభుత్వం కవిగానో కళాకారుడిగానో గుర్తించాలంటే, మొదట ఒక దరఖాస్తు ఫారం పూర్తి చెయ్యాలిట. 'నీపేరు ? వూరు ? కులం ? వయస్సు ? పెద్దల్లో ఎవరైనా బంధువు లున్నారా ? ఏం పుస్తకాలు రాశావు? అక్షరాస్యుడివా, నిరక్షరాస్యుడివా ? నీకు ఎవరైనా సన్మానం

చేశారా ఇదివరకు ? చేస్తే ఎవరు ? ఇంతవరకు ఎవరూ చేయకపోతే, నీ ఖర్చుతో చేయించుకో గలవా ? గలిగితే, ఎంతకాలంలో ?' వంటి ప్రశ్నలున్నాయి దాంలో. చివర్న,' షరా: 1. మూడుకి తక్కువకాకుండా నీకు కావలసిన బిరుదుల లిస్టు జతచేర్చి పంపు. షరా_2. గెజెటెడ్ ఆఫీసరు సర్టిఫికెట్ ఒకటి పంపు. షరా_3. స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియాలో కాని, మీ వూరికి దగ్గరగా ఉన్న ట్రెజరీ ఆఫీసులో కాని రు. 7-50 న. పై.లు కట్టి చలాన్ జత పర్చు. షరా_4. ఇంటర్వ్యూ పిలువబడినచో, ప్రభుత్వం రాను పోను ఖర్చు లిచ్చుకోదు' అని షరాలున్నాయిట.

మహాద్రాక్షారాముడికి పేరుందికదా ? వూరుంది. తగిన కులముంది. సరిపడే వయస్సుంది. పెద్దల్లో బంధువులున్నారు. పుస్తకాలు రాసి పారేశాడు. అక్షరాస్యుడేట మరి. గెజెటెడ్ ఆఫీసరు తనే; సర్టిఫికెట్లు ఇవ్వగలడు. కావలసిన బిరుదులకేం కరువు లేదు. ఏడు రూపాయల ఏభై నయాపైసలు, ఎవడి దగ్గరన్నా బదులుచ్చుకునైనా సరే, విసిరి కొట్ట గలడు. కావలిస్తే, ప్రభుత్వానికే ఇస్తాడు ఖర్చులు ఇంటర్వ్యూకి. ఇక సన్మానం ఒకటే తక్కువైంది. వెంటనే ఏర్పాట్లు ప్రారంభించాడు దానికి.

మొదట తన ఆఫీసులో గుమాస్తాలందర్నీ పిలిచి, కాఫీ ఇచ్చాట్ట తన గదిలో వాళ్ళ ప్రాణాలన్నీ తన అరచేతిలో ఉన్నాయన్న సంగతి సరదాగానే గుర్తు చేశాట్ట. ప్రాణాలంటే గవర్నమెంట్ ఉద్యోగస్తుల పరిభాషలో కాన్ఫిడెన్షల్ రికార్డ్సుట. తర్వాత ఏర్పాట్లన్నీ చురుగ్గానే సాగి పోయాయి. వూళ్లో ఒక కొత్త సాంస్కృతిక సంస్థ నెల కొంది. అందులో సభ్యులంతా ఆయన ఆఫీసులో పని చేసేవాళ్లే. కృష్ణపక్షం శుక్లపక్షంగా మారేలోగా ఆయన సన్మానానికి ఏర్పాట్లు జరిగాయి. శుక్లపక్షం కృష్ణపక్షంగా మారేసరికి, ఆయనకి శాలువ కప్పేశారు. ' కవికులశేఖర ' అని బిరుదు ఆయనకు లభించి

నది. ఆయనకు ఆ బిరుదు లాభించింది కూడా. పక్షం మారే సరికి ఆయనకి ఉద్యోగం ప్రమోషన్ కూడా వచ్చింది.

'కష్టే ఫలే' అన్నారు, కష్టపడ్డాను, ఫలం లభించింది— అన్నాడు ద్రాక్షారామం, ప్లేటుకో మిగిలిపోయిన బిస్కట్లు, కేకులు పేంటుజేబులోకి దొర్లిస్తూ. అందరూ అదే పని చేస్తూండడంవల్ల కవికులోత్తములకి ముఫ్ఫుత్తుగా లభించిన బిస్కత్తులపై గల ఆప్యాయత నెవరూ గమనించలేదు. ఆయన చేసిన ప్రతి పనీ, ఆయన తర్వాత అదే విధంగా చెయ్య దలచుకున్నాను కనుక నేను గమనించాను.

'కష్టే ఫలే' అన్నదాంతో నాకేమీ పేచీ లేదుకానీ, ఏ ఫలం సంపాదించుకోవాలన్నా కష్టపడాలి అంటే అంగీకరించడం కష్టం. జామపళ్లు తినాలని బుద్ధిపుట్టిన ప్రతివాడూ తన దొడ్లోనే జామ మొక్కలు పాతి పెంచాలి అంటే అసంభవం. పక్కింటివాళ్ళ జామచెట్టు మీదకి రాళ్లు విసిరి, ఫల సంపాదనం చేయడం సులభం. ద్రాక్షారామాన్ని పక్కకు పిలిచి, 'బ్రదర్, నీకైతే నీ కింద పనిచేసే గుమాస్తాలు ఉన్నారు సన్మానం చేయడానికి. నా కెవరూ లేరు. పైగా ఉన్న ఒక్క నౌకర్నీ డిస్మిస్ చేద్దామంటే ఐదు వందల మైళ్ళు రాసి అధికారులను ఒప్పించాలి. నాకు సన్మానం చేయడానికి మా ఆవిడకూడా ఒప్పుకోడం లేదు. దేశంలో అక్షరం ముక్కరాని ప్రతివాడికీ సన్మానం జరిగిపోతుంది. సన్మాన రహితుండనై నే నిక బ్రతకజాలను. నువ్వే దారి చూపించాలి' అని బ్రతిమాలుకున్నాను.

అప్పుడు ద్రాక్షారామం దక్షిణ తీసుకుని ఉపదేశం చేశాడు. కూటి కోసం కోటి వేషాలు. మోసాలని అన్నా అనవచ్చు. సన్మానఫలితాలని కూడా నయాపైసల్తో లెఖ్ఖపెట్టవచ్చు. ద్రాక్షారాముల ఉపదేశాన్ని లోకోపకార్థం దక్షిణ తీసుకోకుండానే పబ్లీకు చేసేస్తున్నాను. సంతో

షించి, మీ రెవరైనా నాకు సన్మానం చేస్తానంటే, నాకు అభ్యంతరం లేదు. అలా ఆ రెండో క్యూలో నిలబడండి. థేంక్యూ.

ద్రాక్షారామం అన్నాడు :

"ఈ దక్షిణకి రసీదివ్వాలా ? ఎందుకు ? కావాలంటే, ఇస్తాను. వచ్చిన ప్రతి పైసాకి రసీ దిస్తే, ఇన్‌కమ్ టేక్సు వాళ్ళు పీక పట్టుకుంటారు... థేంక్యూ.... అది సరేగాని, నీకు సన్మానం కావాలంటావ్. నాకు అర్థం ఔతుందిలే నీ బాధ. ఐదు రూపాయ లివ్వగలవా ? ఇస్తే, నీ పేరు రచయితల పుస్తకంలో ఎక్కుతుంది. 'ఫలానా' బీడీ ఫ్యాక్టరీ ప్రొప్రయిటరు లేడూ ? అతనికి అక్షరంముక్క రాదు. రాకపోతే నేం? పేరెక్కలే పేపర్లో ? నువ్వేం రాయక్కర్లేదు—నీకు రాసిపెట్టే వాళ్ళుంటారు—రాయడంవల్ల ప్రయోజనం ఉంటే !

సంఘం నిన్ను సన్మానించా లంటావ్ ! సంఘానికి ప్రయోజనం ఉండొద్దూ నిన్ను సన్మానించడం వల్ల ? ఉండాలి ! పూర్వం ఉత్తమ కవిత్వసృష్టి వల్ల సమాజానికి ప్రయోజనం ఉందని రాజులు భావించేవారు. కనుక— కవితాశక్తినీ, పాండితీ ప్రతిభనీ పరీక్షించి. కవులకీ, పండితులకీ బహుమతు లిచ్చేవారు. 'ఫలానా కవిగారు నా ఆస్థానంలో ...ంటే —నాకే ప్రయోజనం' అనుకునేవారు రాజుగారు. గండ పెండే... స్వయంగా తొడిగి — గౌరవించేవారు ! కవి ఎదురైతే మద... ...శ్గి. చేయూత ఇచ్చి, ఎక్కించుకునేవారు - కారులో లిఫ్టు ...కీ ఎక్కించి, భుజం పట్టేవారు. అలా గౌరవిస్తే, ఇహం ...; తనకో, తన రాజ్యానికో ; ప్రత్యక్షంగానో, పరోక్షం ...ం ఉంటుందని భావించేవారు.

...ం నిన్ను సన్మానించాలన్నా, మరే సంఘం సన్మా... ...ర్ం కినపడాలి సంఘానికి. అధమం సంఘంలో

వ్యక్తులికి. ఉత్తమ కవిత్వసృష్టి చేసి ఎవర్ని ఉద్ధరిస్తావ్? అణాపైసల్లో చెప్పు ఎంత లాభం కలుగజేయగలవో. రాజకీయవేత్తలకీ, మంత్రులకీ డాక్టరేట్ పట్టాలివ్వటానికి క్యూలో నిలబడుతున్నాయి యూనివర్సిటీలన్నీ. ఊరికే సరదాగా అంటావా? ఊరికే విజ్ఞానాన్ని సంపాదించుకోవడానికి ప్రయత్నం చెయ్యకు. నీకు సన్మానం చేస్తే, అన్ని ఖర్చులు పెట్టుకొని, ఇంత డబ్బిస్తానని వాగ్దానం చెయ్యి. కావాలంటే— నేను రికమెండు చేస్తాను. లేకపోతే—'నువ్వు నాకు అక్కడ సన్మానం చేస్తే, నేను నీకు ఇక్కడ సన్మానం చేస్తాను' అని ఉత్తరాలు రాయి. డబ్బు ఖర్చుపెట్టడానికి వీల్లేదంటావా? పేరున్నవాడి జుట్టు ఎవడిదైనా చేత్తో పట్టుకొని, ఝాడిస్తానని బెదిరించు—సన్మానం చెయ్యకపోతే. నాయనా, గమనించు, ఈ లోకంలో రెండే ఉన్నాయి పట్టుకోడానికి. ఒకటి - జుట్టు, రెండు - కాళ్ళు. మొదటిది అందితే మంచిది. లేకపోతే—సువర్ణపుష్పదానం చేసుకోవలసిందే".

ఈ ఉపదేశం చేసి, ద్రాక్షారామం 'అర్జెంటుగా అసెంబ్లీకివెళ్ళాలి' అంటూ ఇంటికి వెళ్ళిపోయాడు.

తర్వాత గురువుగారు చెప్పినట్టుగా చాల మందికి ఉత్తరాలు రాశాను. ఏమో? ఏ పుట్టలో ఏ పాముందో ఎవరు చెప్పగలరు? చేసినా చెయ్యచ్చు సన్మానం. ఎవరికి వాళ్ళే, వాళ్ళకి వాళ్ళే స చేసుకోవడంలో బిజీగా ఉన్నామని, 1962 వరకు సన్మా ఐపోయాయని ఉత్తరాలు రాశారు. ఇక నేను తప్ప నా చేసేటట్టు కనబడలేదు. చివరికి నేనే మారు పేర్లతో పత్రికలకి, నేను సాహిత్యానికి చేసిన సేవను ఉత్తరాలు చూసి మరి కొందరు రాశారు పత్రికల ఒక రచయితతో లోపాయకారిగా పార్ట్నర్షి

పెట్టాడు, నేను హైద్రాబాదులో పెట్టాను. 'కృష్ణ
ప్రపంచ మేధావులకోవలోకి చెందినవాడు. అతని
లానా గుజరాతీ పత్రిక ఇటీవల ఈ విధంగా రాసింది.
లసిన బాధ్యత ఆంధ్రదేశం పై ఉంది. సన్మానించ
లో సగం నన్ను ఇమ్మన్నా ఇస్తాను' అని నా
త్రులకి కాకినాడ నుంచి ఉత్తరాలు రాస్తున్నాడు.
నేను అతన్ని గురించి హైద్రాబాదు నుంచి రాస్తున్నాను.

ఈ పద్ధతి నెగ్గి తీరాలి మరి. ఇదివరకు చాలమంది జంటకవులు పైకి వచ్చారుట – ఈ విధంగా!

ఈ లోగా మా గురువుగారు నాకు ఇదివరకే సన్మానం జరిగిందని గెజెటెడ్ ఆఫీసరు సర్టిఫికెట్ ఇచ్చారు. స్టేట్ బ్యాంకులో రు. 7–50 న. పై.లు కట్టేశాను. నాకు కావల్సిన బిరుదుల లిస్టు పంపించాను. మిగిలిన సర్టిఫికెట్లన్నీ పంపించాను. నేడో రేపో గవర్న మెంట్ ఆఫ్ ఇండియా నుంచి లేఖ వస్తుంది. రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో నేనూ ఒక 'పద్మ–' ఐపోవచ్చు. నన్ను పొగడదల్చుకున్న వాళ్ళంతా త్వరపడండి.

దిగో — అలా గుమిగూడితే కాదు. జేబుదొంగలుంటారు
అలా క్యూలో నిలబడండి.

[ 1961 ]



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA104B176 |
| పుస్తకం పేరు | పోరాటపథంలో నేను |
| తారీఖు | 21 February 2025 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI,142 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Naveena |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | [illegible] |